Haqeeqat-e-Hajj
Khutbaat-V
(Telugu)

# హజ్ వాస్తవికత

ఉర్దూ మూలం:
మౌలానా మౌదూది

అనువాదం:
యస్.ఎమ్. ఖాద్రి

# విషయసూచిక

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# హజ్

ముస్లిమ్ సోదరులారా! గత ప్రసంగాల్లో నేను, నమాజ్, రోజా, జకాత్‌ల గురించి వివరంగా చెబుతూ, ఈ ఆరాధనలు మనిషి జీవితాన్ని ఇస్లామ్‌కు అనుగుణంగా ఎలా మలుస్తాయో, మనిషిని దైవదాస్యం కోసం ఎలా సమాయత్త పరుస్తాయో విశదీకరించాను. ప్రస్తుతం, విధిగా ఆచరించవలసిన ఆరాధనల్లో ఒక హజ్ గురించి మాత్రమే వివరించవలసి ఉంది. దీని ప్రయోజనాలను కూడా మీ ముందుంచవలసి ఉంది.

అరబీ భాషలో హజ్ అనే పదానికి యాత్ర అని అర్థం. హజ్ అనే ఆరాధనలో ప్రజలు కాబా గృహాన్ని దర్శించే సంకల్పంతో యాత్ర చేస్తారు కాబట్టి దాన్ని 'హజ్' అని అంటారు. హజ్ ప్రారంభ గాధ అత్యంత గుణపాఠం గరిపేది. మొదట, ఈ గాధను ఏకాగ్రచిత్తంతో వింటేగాని హజ్ వాస్తవికత ఏమిటో బాగా అర్థం కాదు. ఆ తరువాత దాని ప్రయోజనాలను అర్థం చేసుకోవడం ఎంతో సులవౌతుంది.

హజ్రత్ ఇబ్రాహీమ్ అలైహిస్సలాం పేరు వినని ఏ ముస్లిమైనా, ఏ క్రైస్తవుడైనా మరే యూదుడైనా ఉంటాడా? ప్రపంచం మూడింట రెండొంతుల కంటే అధికమైన జనాభా ఆయనను తన నాయకునిగా తలుస్తోంది. హజ్రత్ మూసా (అ.స) హజ్రత్ ఈసా (ఏసుక్రీస్తు) (అ.స), హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం ఆయన సంతతిలోనివారే. ఆయన వెలిగించిన ఆ దివ్వెతోనే ఈ ప్రపంచంలో సన్మార్గ కాంతి వ్యాపించింది. నాల్గువేల ఏండ్ల క్రితం ఆయన ఇరాక్ భూభాగంలో జన్మించారు. అప్పుడు ప్రపంచం దైవాన్ని మరిచి మనుగడ సాగిస్తోంది. భూమండలంపై తన నిజ ప్రభువును గుర్తించి ఆయన ముందే భక్తితో మోకరిల్లే

ఏ ఒక్క వ్యక్తి కూడా మిగిలిలేదు. హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) ఏ జాతిలోనైతే జన్మించారో ఆ జాతి ప్రపంచంలోకెల్ల వృద్ధీవికాసాలతో అలరారుతున్న జాతి. కానీ మార్గభ్రష్టత్వంలో మిగిలిన అన్ని జాతులకంటే మిన్నగా నిలిచింది. వైజ్ఞానికంగా, పారిశ్రామికంగా ఎంత అభివృద్ధిచెందినా, సృష్టితాలు పూజలకు అర్హమైనవికావు, సృష్టికర్తకు సరితూగవు అన్న యదార్థం వారి బుద్ధికి అందలేదు. ఆ జాతి వారిలో నక్షత్రాలు, విగ్రహాలు పూజించబడేవి. జ్యోతిష్యం, జోస్యం, శకునాలు, జాలవిద్య, తాయెత్తులు బాగా ప్రాచుర్యంలో ఉన్నాయి. మన దేశంలో అర్చకులు, పురోహితులు, పండితులు ఉన్నట్లు వారిలోను పూజారులు, అర్చకులు, దేవాలయ సంరక్షకులు ఉండేవారు. వారు పూజలు జరపడంతో పాటు అర్చనలు చేసేవారు, పెళ్ళిపేరంటాలు, అంత్యక్రియల్లాంటి లాంఛనాలు నిర్వహించేవారు. జ్యోతిష్యం పేరిట సాధారణ ప్రజల్ని వారి ఉచ్చుల్లో బిగించేవారు. ప్రజలు కూడా వారినే తమ భాగ్య విధాతలుగా నమ్మేవారు. వారు చెప్పినట్టు నడుచుకుంటూ, వారి కాంక్షలకు దాస్యం చేసేవారు. ఈ పూజారులు దేవతల ప్రతినిధులని, వారనుకుంటే మనం సుఖంగా ఉండగలం, లేకపోతే సర్వనాశనం అయిపోతాం అని ప్రజలు నమ్మడమే దానికి కారణం. పూజారులకు, పాలకులకు మధ్య సన్నిహిత సంబంధాలు ఉండేవి. అమాయక ప్రజల్ని పూజారుల సాయంతో పాలకులు, పాలకుల అండదండలతో పూజారులు తమ దాసులుగా చేసుకొని పబ్బం గడుపుకునేవారు. మరోవైపు ఈ పాలకుడు దేవతా అంశమని, ఆయన దేవతల్లో ఓ దేవుడే అని, దేశానికి ప్రజలకు అతడే ప్రభువు అని, అతని నోట వెలువడిన ప్రతి మాటా శాసనం అని, ప్రజల ధన ప్రాణాలపై అన్ని విధాల అతనికి అధికారం ఉందని పూజారులు ప్రజల్ని నమ్మింపజేసేవారు. అదేకాకుండా ప్రజల మనోమస్తిష్కాల్లో రాజుల దైవత్వభావన నాటుకోవడానికి రాజుల సమక్షంలో పూజా లాంఛనాలు జరిపేవారు.

ఇలాంటి పరిస్థితిలోనే ఆ జాతిలో హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) జన్మించారు. ఆయన పుట్టిన కుటుంబం కూడా ఆ పూజారుల కుటుంబం కావడం విశేషం.

ఆయన తండ్రితాతలు స్వయంగా ఆ జాతికి పూజారులు, పండితులూను. ఆ ఇంట ఇబ్రాహీమ్ (అ.స) కు లభించగల శిక్షణ కూడా ఓ పండిత పుత్రునికి లభించే శిక్షణే. పుట్టినప్పట్నుంచి ఆ మంత్రోచ్చారణలే ఆయన చెవులకు తాకాయి. పూజారులు, మత గురువుల లక్షణాలే ఆయన తన సోదరుల్లో, తన బంధువుల్లోనూ గాంచేవారు. తాను తన జాతికి ఓ మతాధిపతిగా, తన ఆధిపత్యం చెలాయించడానికి ఆ మందిర పీఠం ఆయన కోసం ఎదురుచూస్తోంది. ఆయన కుటుంబం ఇప్పటి వరకు ధనార్జన చేసి సంపన్నంగా మారడానికి కారణభూతమైన ఆ అర్చనలు, నైవేద్యాలు కూడా ఆయన్ను తమ వైపునకు ఆహ్వానిస్తున్నాయి. అదేవిధంగా ప్రజలు చేతులు కట్టుకొని భక్తి ప్రపత్తుల్తో ఆయన ముందు తలవంచి నిలబడడానికి సిద్ధంగా ఉన్నారు. ఆయన కూడా, తన సంబంధాన్ని దేవతల్తో ముడిపెట్టి జోస్యంతో సామాన్య రైతు మొదలు మహారాజు వరకు ప్రతివాణ్ణి తన మతాధిపత్యానికి దాసునిగా చేయగలడు. ఇలాంటి అంధకారబంధురమైన సమాజంలో ఏ ఒక్క వ్యక్తికూడా సత్యాన్ని ఎరిగినవాడు, నమ్మేవాడు లేడు. అలాగే సత్యకాంతి లభించే ఏ ఆశాలేదు. అలాంటి సమయంలో ఎనలేని వ్యక్తిగత లాభాలు, కుటుంబ ప్రయోజనాలను కాలదన్ని కేవలం సత్యం కోసం, సకల కష్టనష్టాలను స్వీకరించడానికి ఏ సామాన్య వ్యక్తి అయినా సాహసించగలడా?

అయితే హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) సామాన్య వ్యక్తి కారు. ఆయన వ్యక్తిత్వమే వేరు. ప్రాజ్ఞత రాగానే ఆయన ఆలోచనా జ్ఞానం కూడా పెరగ నారంభమైంది. ఆయన ఇలా ఆలోచించనారంభించారు. "దాసుల్లా పరిభ్రమించే ఈ సూర్యుడు, చంద్రుడు, తారలు, మనిషి తన స్వహస్తాల్తో చెక్కిన విగ్రహాలు, మనలా జన్మించిన ఈ రాజులు ఎలా దేవుళ్ళవగలరు? తమంతట తాము కదలలేనివి, తమను తాము కాపాడుకోలేనివి, తమ జనన మరణాలపై సైతం ఎలాంటి నియంత్రణ లేనట్టివి ఎలా దేవుళ్ళవుతాయి? మనిషి వాటి ఎదుట భక్తి ప్రపత్తుల్తో తల వంచడానికి, మొక్కడానికి, వాటి శక్తికి భయపడడానికి, వాటిని

సేవించడానికి వాటి వద్ద ఏముందని? భూమ్యాకాశాల్లో కనిపించేది, మనకు తెలిసినదీ, ప్రతిదీ తమ అవసరాలకు ఇతరులపై ఆధారపడేదే. వాటిలో ప్రతిదీ ఏదో ఒక శక్తికి లోబడే ఉంది. ప్రతిదీ ఎప్పుడో ఒకప్పుడు పతనానికి గురి కావలసినదే. అలాంటప్పుడు వీటిలో ఏదైనా దైవం ఎలా అవుతుంది? వీటిలో ఏదీ నన్ను సృష్టించనప్పుడు, దేని చేతిలోనూ నా జనన మరణాలు గాని, లాభనష్టాలుగాని లేనప్పుడు, దేని దగ్గరా నా కోరికలను తీర్చే బలంగాని, ఉపాధిని కల్పించే శక్తిగాని లేనప్పుడు నేనెందుకు వాటిని ప్రభువుగా, స్వామిగా తలచాలి? వాటి ఎదురుగా ఎందుకు భక్తితో తల వంచాలి? అందరినీ పుట్టించినవాడు, ప్రతివారికీ ఆధారభూతమైనవాడు, అందరి జనన మరణాలు, లాభనష్టాలకు మూలమైనవాడు - ఆయనే నా ప్రభువు, స్వామి." ఇలా ఆలోచించి ఇబ్రాహీమ్ (అ.స) "వేటినైతే నా జాతి పూజిస్తోందో వాటిని నేనసలు పూజించను" అని ఓ నిర్ణయానికి వచ్చారు. బహిరంగంగా ఇలా ప్రకటించారు:

"ఇన్నీ బరీఉమ్ మిమ్మా తుష్రికూన్"

*(దైవత్వంలో మీరు వేటినైతే భాగస్వాములుగా చేశారో వాటితో నాకసలు సంబంధం లేదు).*

"ఇన్నీ వజ్జహ్తు వజ్హియ లిల్లజీ ఫతరస్సమావాతి వల్ అర్ద హనీఫఁ వమా అనా మినల్ ముష్రికీన్."

*(నేను అన్ని వైపులనుండి ముఖం త్రిప్పుకుని ఏకోన్ముఖుణ్ణై ఈ భూమ్యాకాశాలను సృజించిన సృష్టికర్తనే నా ఆరాధనల కోసం ప్రత్యేకించుకున్నాను. నేను దైవత్వంలో ఎవరినీ భాగస్వాములుగా కల్పించేవాణ్ణి ఏమాత్రం కాను)*

ఇలా ప్రకటించిన తోడనే హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స)పై ఎనలేని కష్టాలు, కడగండ్లు వచ్చిపడ్డాయి. నా ఆస్తిలో నీకు భాగం లేదు, తక్షణం ఇంటినుండి 'బయటకు వెళ్ళిపో అని తండ్రి అంటే, మాలో ఎవ్వరూ నీకు శరణు ఇచ్చేది లేదు

అని ఆయన జాతి తెగేసి చెప్పింది. ప్రభుత్వం కూడా ఆయనకు వ్యతిరేకమై రాజు ఎదుట నేరస్తునిగా ఆయన్ను నిలబెట్టింది. అయినా ఆ ఒంటరి మనిషి అందరికీ దీటుగా సత్యం కోసం బలంగా నిలబడ్డాడు. "నాన్నగారు నాకు లభించిన జ్ఞానం మీకు లభించలేదు. కాబట్టి నేను మిమ్మల్ని అనుసరించేదానికంటే మీరే నన్ను అనుసరించాలి" అని ఎంతో వినమ్రుడై సమాధానం ఇచ్చారు తండ్రికి. జాతి బెదిరింపులకు సమాధానంగా, అది పూజించే విగ్రహాల్ని తన చేత్తో తుత్తునియలు చేసి, మీరు వేటినైతే పూజిస్తున్నారో అవి ఎంత బలహీనమైనవో చూడండి అని రుజువు చేశారు. రాజ దర్బారులో నిలబడి ఓ రాజా! నీవు నాకు దైవానివి కావు, పూజ్యుడవూ కావు. నీకు, నాకు జీవన్మరణాలను ప్రసాదించేవాడు ఎవడో, ఈ సూర్యుడు సైతం ఎవరి చట్టానికి లోబడి ఉన్నాడో ఆయనే నా దైవం, స్వామీ, ప్రభువున్నూ అని ధైర్యంగా చెప్పారు. చివరికి రాజదర్బారులో ఇబ్రాహీమ్ (అ.స)ను సజీవంగా దహనం చేయాలనే తీర్పునిచ్చారు. కాని, ఏకేశ్వరుణ్ణే విశ్వసించిన ఆ పర్వతం లాంటి నిశ్చలమైన గుండె నిబ్బరంగల మనిషి ఆ భయంకరమైన శిక్షను అనుభవించడానికి కూడా సిద్ధపడ్డారు. అల్లాహ్ తన శక్తి ద్వారా ఆయన్ను ఆ అగ్నినుండి కాపాడాడు. అప్పుడు ఆయన తన ఇంటిని, బంధుమిత్రుల్ని, తన జాతిని, తన మాతృభూమిని అన్నిటిని వదిలేసి కేవలం తన భార్య, సోదర కుమారునితో పాటు బయలుదేరి ఎన్నో దేశాలు తిరిగారు. ఆ వ్యక్తి కొరకు తన ఇంట మతాధిపత్యం చలాయించి తన జాతికే ఓ గురువుగా మారే అవకాశం ఉంది. గౌరవసంపదలు ఏకంగా తనను వరించడానికి సిద్ధంగా ఉన్నాయి. తనే కాదు తన సంతానం కూడా ఈ పీఠంపై కూర్చుండి సర్వసుఖాలను జుర్రుకొనేటట్లు అవకాశం వుంది. కాని ఆ వ్యక్తి తన కోసం, తన భార్యాపిల్లల కోసం స్వదేశ త్యాగాన్ని, నిరాధారమైన జీవితాన్ని ఎంచుకున్నాడు. ఎందుకంటే ప్రపంచ ప్రజల్ని ఈ చిల్లర దేవుళ్ళ వలలో పడేసి తాను సుఖభోగాలు అనుభవించడం ఇష్టం లేదతనికి. దీనికి భిన్నంగా ఓ నిజమైన దేవుని వైపునకు పిలుపునిచ్చిన అపరాధానికి అశాంత జీవితమే అతనికి ప్రియమైనది.

స్వదేశాన్ని వదిలి హ‌జ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) సిరియా, పాలస్తీనా, ఈజిప్టు, ఇంకా ఇతర అరబ్బు దేశాల్లో తిరిగారు. ఈ దేశాటనలో ఆయన ఎలాంటి కష్టాలనెదుర్కొన్నారో ఆ దైవానికే తెలుసు. బయలుదేరేటప్పుడు చిల్లిగవ్వ లేదాయన చేతిలో. ఆయన బయలుదేరింది తన పొట్టకోసం కాదు. ఆయన ఆలోచన అంతా ప్రజల్ని ప్రతివాడి దాస్యంనుండి వెలికితీసి కేవలం ఒకే దైవానికి దాసులుగా మలచడమే. ఇలాంటి ఆలోచన గల వ్యక్తిని తన సొంత తండ్రీ, తన సొంత జాతే భరించలేనప్పుడు ఇంకెవరు భరిస్తారు? ఆయనకు స్వాగతం ఎక్కడ లభిస్తుంది? ఎక్కడ చూసినా ఆ మతాధిపతులే, మేమే దేవుళ్ళం అనే పాలకులే. ఎటు చూసినా బూటకపు దేవుళ్ళ వలలో చిక్కుకున్న అమాయక ప్రజానీకమే. దైవం తప్ప మరెవ్వరినీ ఆరాధ్యునిగా స్వీకరించడానికి సిద్ధంగా లేని వ్యక్తి, ఒకే దైవం తప్ప మరే స్వామీ, ప్రభువు లేడని చాటిచెప్పే వ్యక్తి, అందరి స్వామ్యాన్ని, దైవత్వాన్ని కాదని ఆ ఒక్క ప్రభువునకే దాసులై ఉండాలని కోరే వ్యక్తి, వారి నడుమ ఎలా శాంతంగా ఉండగలడు? ఈ కారణంగానే హ‌జ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) కు ఎక్కడా ప్రశాంతత లభించలేదు. సంవత్సరాల తరబడి దేశాల వెంట తిరిగాడు ఆయన. ఒకప్పుడు 'కన్ఆన్' దేశపు గ్రామాల్లో తిరుగుతూ ఉంటే మరొకప్పుడు ఈజిప్టులో, ఇంకొకప్పుడు అరేబియా ఎడారుల్లోను మకామ్ వేశాడు. ఇలా ఆయన యవ్వనం అంతా గడిచిపోయి, తల వెంట్రుకలు నెరిసిపోయాయి.

ఇలా ఆయనకు తొంభై ఏళ్ళు పూర్తవడానికి ఇంకా నాలుగేళ్ళే మిగిలివున్నాయి. సంతానం కలిగే ఆశా లేదు. అప్పుడు అల్లాహ్ ఆయనకు సంతానం ఇచ్చాడు. అయినా, తానెలాగూ చితికిపోయాడు, కనీసం తన సంతాన మైనా సంపాదించి, ప్రయోజకులు కాగలగాలని, వారికేదైనా ఉపాధి కల్పించాలని అనుకోలేదు ఆ వ్యక్తి. ఈ వృద్ధ ముస్లిముకు ఒకటే ధ్యాస-తాను ఏ దైవ ధర్మవ్యాప్తి ఉద్యమంలో తన జీవితాన్నంతా ధారపోశాడో, తన మరణానంతరం కూడా ఆ ఉద్యమం కొనసాగాలని. ఇందుకే అల్లాహ్ తనకు సంతానం ఇవ్వాలని ఆయన

కోరుకున్నాడు. అల్లాహ్ ఆయనకు సంతానం ప్రసాదించాక, వారిని ఆ ధర్మకార్యం కోసం తయారు చేయాలనుకున్నాడు. ఆ పరిపూర్ణ మానవుని జీవితం ఓ నిజమైన నికార్సైన ముస్లిమ్ జీవితం. యవ్వన ఆరంభంలో జ్ఞానం కలగగానే తాను దైవాన్ని గుర్తించాడు. ఆ దైవం 'అస్లిమ్' (ఇస్లాం స్వీకరించు, నిన్ను నీవు నాకు అర్పించుకో, నా వాడివే అయిపో) అని అనగానే 'అస్లమ్తు లిరబ్బిల్ ఆలమీన్' (నేను ఇస్లామ్ స్వీకరించాను. విశ్వప్రభువుకే చెందిన వాణ్ణయ్యాను, నన్ను నేను ఆయనకు అర్పితమయ్యాను) అనే ప్రమాణం చేశాడు. ఆయన తన జీవితమంతా ఈ ప్రమాణానికి కట్టుబడి జీవించాడు. ఆయన ఆ విశ్వప్రభువు కోసం శతాబ్దాలుగా తన వంశంలో వస్తున్న తాతముత్తాతల మతాన్ని, ఆచారాలను విడనాడి, ప్రాపంచిక లాభాలన్నిటిని కాలదన్ని, తన ప్రాణాల్ని సైతం అగ్నికి గురిచేశాడు. దేశబహిష్కరణను, తద్వారా వచ్చిపడ్డ కష్టాల్ని కడగండ్లను ఎదుర్కొన్నాడు. దేశదేశాల్లో నిలకడ లేకుండా తిరిగాడు. తన జీవితపు ప్రతి క్షణాన్ని విశ్వప్రభువు ఆదేశాలకు అంకితం చేసి ఆయన ధర్మప్రచారంలో వెచ్చించాడు. చివరికి వృద్ధాప్యంలో దైవం తనకు సంతానం ఇస్తే, వారికి కూడా ఈ ధర్మమార్గాన్నే ఎన్నుకున్నాడు. కాని ఈ పరీక్షల తరువాత ఇంకొక చివరి పరీక్ష మిగిలే ఉంది. ఈ వ్యక్తి 'ప్రపంచంలోని ప్రతి వస్తువుకన్నా విశ్వప్రభువునే అధికంగా ప్రేమిస్తాడు' అనే నిర్ణయానికి ఈ పరీక్ష అవసరం. ఈ వృద్ధాప్య దశలో, పూర్తి ఆశలుడిగిన తరువాత అతనికి సంతానం కలిగింది. అలాంటి ఏకైక కుమారుణ్ణి విశ్వప్రభువు కోసం బలి ఇవ్వగలడా లేదా అన్నదే ఆ పరీక్ష. తరువాత, ఈ పరీక్ష కూడా జరిగింది. సంకేతం లభించగానే ఆయన తన ముద్దుల కుమారుణ్ణి తన స్వహస్తాలతో జిబహ్ చేయడానికి (బలివ్వడానికి) సిద్ధపడ్డాడు. అప్పుడు, "ఇప్పుడు నీవు ముస్లిమ్ అయిన ప్రకటనను రుజువు చేశావు. ప్రపంచ నాయకత్వానికి అర్హుడవు అయ్యావు" అన్న తీర్పు ఇవ్వడం జరిగింది. ఈ విషయాన్ని ఖుర్ఆన్ ఇలా తెలుపుతుంది:

"ఇబ్రాహీమ్‌ను అతని ప్రభువు కొన్ని విషయాల్లో పరీక్షించాడు. వాటన్నిటిలో ఆయన పూర్తిగా నెగ్గారు. అప్పుడు అతని ప్రభువు అన్నాడు, 'నేను నిన్ను

మానవులందరికీ నాయకునిగా చెయ్యబోతున్నాను' ఇబ్రాహీం తన ప్రభువును ఇలా అడిగాడు, 'ఈ నీ వాగ్దానం నా సంతానానికి కూడా వర్తిస్తుందా?' అప్పుడు అల్లాహ్, 'నా వాగ్దానం దుర్మార్గులైన వారికి వర్తించదు.' అని సమాధానం చెప్పాడు. *(అల్ బఖర : 124)*

ఇలా హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స)కు ప్రపంచ నాయకత్వం ప్రసాదించి, ఇస్లామీయ ఉద్యమానికి నాయకునిగా ఎంచుకోవడం జరిగింది. ఇప్పుడాయనకు ఈ ఉద్యమ వ్యాప్తికోసం, వివిధ ప్రాంతాల్లో ప్రతినిధులుగా ఉండి పనిచేయడానికి అర్హులైన వారు అవసరమయ్యారు. ఈ కార్యం కోసం ఆయనకు ముగ్గురు వ్యక్తులు చేదోడు వాదోడుగా నిలిచారు. ఒకరు ఆయన సోదర కుమారుడు హజ్రత్ లూత్ (అ.స), రెండవవారు ఆయన పెద్ద కుమారుడు హజ్రత్ ఇస్మాయిల్ (అ.స). ఈయనే విశ్వప్రభువు ఆజ్ఞమేరకు బలవడానికి సిద్ధపడ్డారు. మూడో వ్యక్తి ఆయన చిన్న కుమారుడు హజ్రత్ ఇస్హాఖ్ (అ.స).

సోదర కుమారుణ్ణి ఆయన 'సద్దోమ్' ప్రాంతానికి నాయకునిగా చేసి పంపారు. నేడు దాన్నే 'ట్రాన్స్‌జోర్డాన్' గా పిలుస్తున్నారు. ఈ ప్రాంతంలో ఆనాటి అతి నీచమైన జాతి నివసిస్తూ ఉండేది. కాబట్టి ఆ ప్రాంతాలన్ని చక్కదిద్దడం ఆయన అభిమతం. అదేకాకుండా ఇక్కణ్ణుండి సుదూరప్రాంతాలపై ప్రభావం వేయడం కూడా ఆయన ఉద్దేశ్యం. ఎందుకంటే ఈరాన్, ఇరాక్, ఈజిప్టుల నడుమ వచ్చిపోయే వ్యాపార బిడారాలు (బృందాలు) ఈ మార్గంగుండానే ప్రయాణించేవి. ఇక్కడినుండి దైవధర్మప్రచారం కొనసాగించడం సులువుగా ఉండేది.

చిన్న కుమారుడు హజ్రత్ ఇస్హాక్ (అ.స)ను 'కన్ఆన్' ప్రాంతంలో ఉంచారు. దీన్నే మనం నేడు పాలస్తీనాగా పిలుస్తున్నాం. ఈ ప్రాంతం సిరియా, ఈజిప్టుల నడుమ ఉంది. సముద్రతీరాన ఉండడం మూలంగా ఇతర దేశాలపై కూడా ఇక్కడి నుండి ప్రభావం వేయొచ్చు. ఇక్కడినుండే హజ్రత్ ఇస్హాఖ్(అ.స) కుమారుడు హజ్రత్ యాఖూబ్ (అ.స) (ఈయన్నే ఇస్రాయీల్ అని కూడా

పిలిచేవారు) మనవడు హజ్రత్ యూసుఫ్ (అస)ల ద్వారా ఇస్లామీయ ఉద్యమం ఈజిప్టు వరకు చేరగలిగింది.

పెద్ద కుమారుడైన హజ్రత్ ఇస్మాయీల్ (అ.స)ను హిజాజ్ ప్రాంతలోని 'మక్కా' అనే ప్రదేశంలో ఉంచారు. ఓ సుదీర్ఘ కాలంపాటు ఆయన వెంటనే ఉంటూ అరేబియా మూలమూలల్లో ఇస్లామీయ బోధనలను వ్యాపింపచేశారు. ఆ తరువాత ఇక్కణ్ణే ఆ తండ్రీకొడుకులు ఇద్దరు కలిసి ఇస్లామీయ ఉద్యమకేంద్రాన్ని నిర్మించారు. అదే 'కాబా' అనే పేరుతో నేడు సకల ప్రపంచానికి పరిచితమైంది. ఈ కేంద్రాన్ని అల్లాహ్ స్వయంగా ఎన్నుకున్నాడు. దాని నిర్మాణ ప్రదేశాన్ని కూడా ఆయనే చూపాడు. ఈ కట్టడం కేవలం ఓ ఆరాధనాలయం మాత్రమేకాదు, ప్రారంభ దినంనుండి దీన్ని సర్వ ప్రపంచానికి ఉద్యమ ప్రచార కేంద్రంగా కూడా ఖరారు చేయడం జరిగింది. దీని నిర్మాణ ఉద్దేశ్యం, దైవాన్ని విశ్వసించేవారు అన్ని వైపులనుండి ఇక్కడికి వచ్చి చేరడం, అందరు కలిసి దైవారాధన చేయడం, ఇస్లామ్ సందేశాన్ని తమ, తమ దేశాలకు గొనిపోవడం. ఈ సమావేశాన్నే 'హజ్' అనే పేరు పెట్టడం జరిగింది. ఈ కేంద్రం ఎలా నిర్మించబడింది, ఏ భావాలతో, మరే ప్రార్థనలతో ఆ ఇద్దరు తండ్రీ కొడుకులు ఈ కట్టడపు గోడలు నిర్మించారో, హజ్‌ను ఎలా ప్రారంభించారో అన్న విషయాలను దివ్య ఖుర్ఆన్ ఇలా వివరిస్తోంది.

> *"ప్రధమంగా మానవుల కొరకు నిర్మించబడిన ఆరాధనా గృహం నిస్సందేహంగా మక్కాలో ఉన్నదే. దానికి సకల శుభాలు ప్రసాదించ బడ్డాయి. విశ్వప్రజలందరికీ అది మార్గదర్శక కేంద్రంగా రూపొందించబడింది. దానిలో స్పష్టమైన సూచనలు ఉన్నాయి, ఇబ్రాహీమ్ యొక్క ప్రార్థనా స్థలం ఉంది. దానిలో ప్రవేశించినవాడు రక్షణ పొందుతాడు."*
>
> *(ఆలి ఇమ్రాన్ : 96)*

> *"వారు ఈ విషయాన్ని చూడటం లేదా; మేము శాంతి నిలయమైన ఒక హరమ్‌ను నెలకొల్పాము. వాస్తవానికి వారి చుట్టు ప్రక్కల వున్న ప్రజలు మాయం చేయబడుతున్నారు."*

(అంటే అరేబియా అంతటా దోపిళ్ళు, హత్యలు పోట్లాటలు రాజ్యం ఏలేటప్పుడు ఈ 'హరమ్' (దైవగృహం)లో సతతం శాంతే నెలకొని ఉండింది. చివరికి అజ్ఞానులైన, క్రూరులైన ఆటవికులు సైతం దీని హద్దుల్లో ప్రవేశించాక తన తండ్రి హంతకుణ్ణి చూసినా ఆ హంతకునికి ఎలాంటి హాని కలిగించే ధైర్యం చేయలేకపోయేవారు). *(అల్ అన్ కబూత్ : 67)*

*"ఈ గృహాన్ని (కాబా) మేము మానవులందరికీ కేంద్రంగాను, శాంతి నిలయంగానూ చేశాము. ఇబ్రాహీమ్ ఆరాధన కొరకు నిలబడిన ప్రదేశాన్ని శాశ్వతమైన నమాజ్ స్థలంగా చేసుకోవలసిందని ప్రజలను మేము ఆదేశించాము. ఇంకా నా ఈ గృహాన్ని, దానికి ప్రదక్షిణం చేసేవారికొరకు, దానిలో ఏతెకాఫ్ పాటించేవారికొరకు, రుకూ, సజ్దాలు చేసేవారికొరకు పరిశుద్ధంగా ఉంచవలసిందని ఇబ్రాహీమ్‌ను, ఇస్మాయీల్‌ను నిర్దేశించాను.*

*ఆ తరువాత ఇబ్రాహీమ్ అల్లాహ్‌ను ఇలా అర్థించాడు, "ప్రభూ! ఈ నగరాన్ని సుఖశాంతుల నగరం చెయ్యి. ఈ నగరవాసుల్లో అల్లాహ్‌ను, పరలోకాన్నీ విశ్వసించే వారికి అన్ని రకాల పండ్లు, ఫలాలు ఆహారంగా ప్రసాదించు." అప్పుడు అతని ప్రభువు ఇలా జవాబు పలికాడు, "విశ్వసించని వారికి కూడా ఇహలోకపు తాత్కాలిక జీవితావసరాలను ప్రసాదిస్తాను, కాని చివరకు వారిని నరకయాతన వైపునకు ఈడుస్తాను. అది అత్యంత దుర్భరమైన నివాసస్థలం."*

*ఇబ్రాహీమ్, ఇస్మాయీల్ ఈ ఇంటి గోడల్ని ఎత్తేటప్పుడు ఈ విధంగా ప్రార్థించేవారు: "ఓ మా ప్రభూ! మా ఈ సేవను నీవు దయతో స్వీకరించు. నీవు అందరి మొరలు ఆలకించేవాడవు, అన్నీ తెలిసిన వాడవు. ప్రభూ! మా ఇద్దరినీ నీకు విధేయులుగా చేసుకో. పూర్తిగా నీ విధేయతకే అంకితమయ్యే ఒక జాతిని మా సంతతినుండి ఆవిర్భవింపజెయ్యి. నీ ఆరాధనారీతుల్ని మాకు తెలుపు. మా తప్పుల్ని మన్నించు. నీవు అమితంగా*

క్షమించేవాడవు; అనంతంగా కరుణించేవాడవు. ప్రభూ నీ వాక్యాలు వారికి వినిపించి, నీ గ్రంథాన్నీ, దివ్య జ్ఞానాన్నీ వారికి బోధించే వారి జీవితాలను తీర్చిదిద్దే ఒక ప్రవక్తను స్వయంగా వారి జాతినుండే వారిలో పుట్టించు. నీవు సాటిలేని సర్వాధికారివి, అనుపమ ప్రజ్ఞాశాలివి."

*(అల్ బఖర: 125 - 129)*

ఇబ్రాహీమ్ ఇలా ప్రార్థించిన సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో: "ప్రభూ! ఈ నగరాన్ని *(అంటే మక్కాను)* శాంతి నగరంగా చెయ్యి. నన్నూ, నా సంతానాన్ని విగ్రహ పూజనుండి కాపాడు. ప్రభూ! ఈ విగ్రహాలు చాలామందిని మార్గం తప్పించాయి. *(నా సంతానాన్ని కూడా ఇవి మార్గం తప్పించే అవకాశం ఉంది. కనుక వారిలో)* నా విధానంపై నడిచేవాడు నావాడు, నాకు వ్యతిరేకంగా వున్న విధానాన్ని ఎవడైనా అవలంబిస్తే నిశ్చయంగా నీవు క్షమించేవాడవు, కరుణామయుడవు. ప్రభూ! తృణకాష్ట జలరహితమైన లోయలో నా సంతానంలో కొందరిని తెచ్చి నీ పవిత్ర గృహంవద్ద నివసింపజేశాను. ప్రభూ! వారు ఇక్కడ నమాజును స్థాపించాలని నేను ఇలా చేశాను. కనుక నీవు ప్రజల హృదయాలను ఆసక్తితో వారివైపునకు మొగ్గేలా చెయ్యి, తినటానికి వారికి పండ్లు ప్రసాదించు, బహుశా వారు కృతజ్ఞులౌతారేమో." *(ఇబ్రాహీమ్ : 35 - 37)*

"మేము ఇబ్రాహీమ్‌కు ఈ గృహం *(కాబా గృహం)* కొరకు స్థలాన్ని సూచించినప్పటి సందర్భాన్ని జ్ఞాపకం తెచ్చుకో. *(అప్పుడు మేము ఇలా ఉపదేశించాము)* నాకు దేనినీ భాగస్వామిగా చేయకు, ప్రదక్షిణం చేసేవారి కొరకూ, ఖియామ్, రుకూ, సజ్దాలు చేసేవారి కొరకూ నా గృహాన్ని పరిశుద్ధంగా ఉంచు, హజ్ కొరకై మానవులందరికీ పిలుపు ఇవ్వు, వారు నీ వద్దకు ప్రతి సుదూర ప్రాంతం నుండి కాలినడకతోనూ, ఒంటెలపైనా ఎక్కిరావాలని మరియు వచ్చి వారు తమ కొరకు ఇక్కడ ఉంచబడిన

ప్రయోజనాలను చూసుకోవాలని. అల్లాహ్ వారికి ప్రసాదించిన పశువుల మీద కొన్ని నిర్ణీత దినాలలో ఆయన పేరును స్మరించాలి, స్వయంగా వారూ తినాలి, లేమికి గురి అయిన అగత్యపరులకూ పెట్టాలి."

*(అల్ హజ్ : 26 - 28)*

ముస్లిమ్ సోదరులారా! ఇదండి ఆ హజ్ ప్రారంభ కథ. ఇది ఇస్లామీయ మూలస్థంభాల్లో అయిదవది. దీనిద్వారా తెలిసిందేమంటే, ప్రపంచంలో మొట్ట మొదట, విశ్వవ్యాప్తంగా ఇస్లామీయ ధర్మ ప్రచారం కోసం ఏ ప్రవక్త అయితే నియమించబడ్డారో, ఆ ప్రవక్తకు కేంద్రస్థానం ఈ 'కాబా'యే. అక్కడి నుండే దైవసందేశం ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు వ్యాపింపజేయడం జరిగింది. హజ్ విధానాన్ని ఖరారు చేయడానికి గల కారణం, ఏకేశ్వరుని దాస్యం చేయడానికి ప్రతినబూనినవారు, ఆయన ఆదేశాల్ని శిరసావహించడానికి సిద్ధమయిన వారు - వారు ఏ జాతివారైనా, ఏ దేశానికి చెందినవారైనా - అందరూ కలసి ఈ కేంద్రంతో సంబంధం పెట్టుకోవాలి. ప్రతి సంవత్సరం ఇక్కడికి వచ్చి ఈ కేంద్రం చుట్టూ ప్రదక్షిణ చేయాలి. అంటే, వారి జీవితం, తన కేంద్రం చుట్టూ తిరిగే చక్రంలాంటిది అని, ఈ అంతర్భావనకు హజ్ బాహ్య ప్రతీకగా భావించాలి.

# హజ్ చరిత్ర

ముస్లిమ్ సోదరులారా! గత ప్రసంగంలో నేను, హజ్ ఎందుకు ప్రారంభం అయిందో చెప్పాను. ఇదేకాకుండా హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) మక్కానగరాన్ని ఇస్లామీయ ఉద్యమానికి కేంద్ర బిందువుగా చేశారని, ఇక్కడ ఆయన పెద్దకుమారుడైన హజ్రత్ ఇస్మాయీల్ (అ.స)ను తన తదనంతరం కూడా ఈ ఉద్యమాన్ని కొనసాగించేందుకు నియమించారని కూడా వివరించాను.

హజ్రత్ ఇస్మాయీల్ (అ.స) తరువాత ఆయన సంతతి ఎప్పటివరకు తన

తంౘ్రి మార్గంపై స్థిరంగా ఉందన్నది ఆ దైవానికే తెలుసు. మొత్తానికి కొన్ని శతాబ్దాల్లోనే వారు తమ తాత ముత్తాతల మార్గాన్ని మరిచి ఇతర మూఢ జాతుల్లో వ్యాపించి ఉన్న ఆచార సంప్రదాయాలను సొంతం చేసుకున్నారు. ఏ కాబాగృహం అయితే ఏకేశ్వరోపాసన కోసం ధర్మప్రచారానికి కేంద్రంగా చేయడం జరిగిందో, ఆ కాబాగృహంలోనే వందలాది విగ్రహాలు వెలిశాయి. హజ్రత్ ఇబ్రాహీమ్, ఇస్మాయీల్ (అ.స)లు తమ జీవితాలను విగ్రహారాధనను అంతం చేయడానికే వెచ్చించారు. కాని, స్వయంగా వారి విగ్రహాలనే చెక్కి ఆ కాబా గృహంలో ప్రతిష్ఠించడం జరిగింది. ఏకోన్ముఖుడైన హజ్రత్ ఇబ్రాహీమ్ సంతానం, 'లాత్', 'మనాత్', 'హుబల్', 'నస్', 'యగూస్', 'ఉజ్జా', 'ఇసాఫ్', 'నాయిలా' ఇంకెన్నో పేర్లుగల దేవతా విగ్రహాలను ప్రతిష్ఠించి వాటిని మొక్కేవారు. చంద్రుడు, బుధుడు, శుక్రుడు, శని, ఒకటేమిటి ఎన్నో గ్రహాలను కూడా పూజించింది వారి సంతతి. భూతప్రేత, పిశాచాలను, జిన్నుల్ని, దేవదూతల్ని, చనిపోయిన తమ పెద్దల ఆత్మలను పూజించారు. అజ్ఞానం ఎంతవరకు వ్యాపించిపోయిందంటే ఇంటినుంచి బయలుదేరినప్పుడు, తమ ఇలవేల్పుల విగ్రహం ఏదీ లభించకపోతే, నడుస్తూ దారివెంట ఏదో ఓ చిన్న రాయి దొరికినా దాన్ని పూజించేవారు. ఆ రాయి కూడా లభించకపోతే మట్టిని నీటితో కలిపి దాన్ని ఓ ముద్దగా చేసి దానిపై మేక పాలు చిలకరించేవారు. ఆ ప్రాణంలేని మట్టి ముద్ద వారి పాలిటి దేవతగా తయారయ్యేది. తమ తండ్రి ఇబ్రాహీమ్, మతాధిపత్యాన్ని, పౌరోహిత్యాన్ని ఇరాక్ భూభాగంలో ఎదిరించి పోరాడారు. కాని, అవి వారి కుటుంబంలోనే చొరబడి తిష్ఠవేసుకున్నాయి. కాబా గృహాన్ని విగ్రహారాధకుల పుణ్యక్షేత్రాలుగా మార్చి అక్కడి అర్చకులై కూర్చున్నారు. హజ్‌ను తీర్థయాత్రగా, ఓ జాతరగా చేసి, ఏకేశ్వరవాద ప్రచారానికి నిర్మించబడిన కాబాను వారు విగ్రహారాధనా ప్రచార కేంద్రంగా మార్చివేశారు. పూజారులు, అర్చకులు వేసే ఎత్తులన్నీ వేస్తూ వీరు అన్ని వైపులనుండి వచ్చే హజ్ యాత్రికుల నుండి కానుకల్ని, మొక్కుబడుల్ని వసూలుచేయ నారంభించారు.

ఇలా హజ్రత్ ఇబ్రాహీమ్, ఇస్మాయీల్ (అ.స)లు ప్రారంభించిన సత్సంప్రదాయాలు తారుమారయ్యాయి. ఏ ఉద్దేశ్యంతో హజ్ విధానాన్ని ప్రవేశపెట్టారో దాని స్థానంలో మరేదో జరగసాగింది.

ఈ అజ్ఞానకాలంలో హజ్ రూపురేఖలు పూర్తిగా మారిపోయాయి. అది కేవలం ఏటేటా జరిగే జాతరలా తయారయింది. పెద్ద పెద్ద తెగలు తమ మందీ మార్బలంతో ఇక్కడికి వచ్చి విడిది చేసేవి. ప్రతి తెగకు ఓ కవి లేక వందిమాగధుడు ఉండేవాడు. తన తెగవారి శౌర్యపరాక్రమాలను, గౌరవాల్ని, దాతృత్వాన్ని కొనియాడ్డంలో ఒకడికి ఒకడు మించిపోయేవాడు. ఆ తరువాత ఒకరిని మరొకరు వికటంగా తూలనాడుకునేవారు. ఆపై దాతృత్వపు పోటీలు జరిగేవి. ప్రతి తెగ తమ గొప్పను చాటుకోవడానికి వంట నారంభించేవారు. ఆ వంటకాల్లో ఒకరిని మించి మరొకరు ఒంటెల్ని జిబహ్ చేసి వండేవాళ్ళు. ఈ దుబారా ఖర్చుల ద్వారా వారికి కావలసిందల్లా అరేబియా మొత్తంలో తమ తెగ పేరు, ప్రఖ్యాతులు మార్మోగడం. ఫలానా తెగవారు ఇంతమందికి అన్నదానం చేశారు అని అనుకోవడం. వీరి సభల్లో సంగీతం, నాట్యం, గానం, మత్తుపానీయాలు, వ్యభిచారం జోరుగా, బాహాటంగా సాగేవి. దైవం వైపు ధ్యాస అతి కష్టంగా మళ్ళేది. కాబా గృహప్రదక్షిణ కూడా జరిగేది. అయితే ఎలా? స్త్రీ పురుషులు ఉభయులూ కలిసి పూర్తి నగ్నంగా కాబా గృహప్రదక్షిణ చేసేవారు. పైగా, 'మా తల్లి కన్నప్పుడు ఎలా ఉన్నామో అలానే దైవ సమక్షంలోకి వస్తాము' అని అనేవాళ్ళు. ఇబ్రాహీమ్ (అ.స)గారి మసీదులో ఆరాధన జరిగేది కాని అది ఎలాంటి ఆరాధన? చప్పట్లు చరచడం, ఈలలు వేయడం, బాకాలు ఊదడం లాంటి ఆరాధన. దైవనామ స్మరణ జరిగేది కాని ఆ స్మరణ ఎలాంటిది? "లబ్బైక అల్లాహుమ్మ లబ్బైక లా షరీకలక ఇల్లా షరీకన్ హువలక తమ్‌లికహు వమామలక్." (అంటే నేను హాజరయ్యాను ఓ నా అల్లాహ్ నేను హాజరయ్యాను, నీకెవరూ భాగస్వామి లేడు కాని నీ వాడు అవడం మూలంగా నీకు భాగస్వామి అయినవాడు తప్ప. నీవు అతనికి అతని ఆస్తికి కూడా

ప్రభువువే) అంటూ స్మరించేవారు. దైవం పేర బలులు ఇవ్వబడేవి కాని ఏ తీరులో? ఈ రక్తమాంసాలు (దైవం శమించుగాక) దైవానికి అవసరం అన్నట్లు బలిపశువు రక్తాన్ని కాబా గృహం గోడలకు పులిమేవారు. మాంసాన్ని కాబా ద్వారంపై పడేశేవారు. హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) హజ్‌కు సంబంధించిన నాల్గు మాసాలు హరాంగా (నిషిద్ధమైనవిగా) నిర్ణయించారు. ఈ నెలల్లో ఎలాంటి పోరాటాలు జరగరాదని ఆదేశించారు. అయితే వారు ఈ పవిత్రతను కొంత మట్టుకు పాటించేవారు కాని ఎప్పుడైనా పోరాడవలసివస్తే జంకులేకుండా ఓ సంవత్సరం నిషిద్ధమాసాల్ని ధర్మసమ్మతంగా మార్చుకొని పోరాడేవారు. మరుసటి సంవత్సరం దానికి బదులుగా ఇతర మాసాల్ని నిషిద్ధమాసాలుగా చేసుకునేవారు.

ధర్మం ఎడల కొంత నిజాయితీగా నడుచుకునేవారు కూడా అజ్ఞానం వల్ల హజ్‌లో క్రొత్త క్రొత్త పద్ధతుల్ని ప్రవేశపెట్టుకునేవారు. కొందరు ప్రయాణసామగ్రి లేకుండానే హజ్‌కోసం భిక్షాటన చేస్తూ బయలుదేరేవారు. వారి దృష్టిలో ఇది పుణ్యకార్యం. పైగా మేము దైవంపై భారం వేసి వెడుతున్నాం, దైవగృహానికి ప్రయాణమయ్యాం, మరి ఈ ప్రాపంచిక ఆర్భాటాల్తో మాకేం పని అనేవారు. సాధారణంగా హజ్ ప్రయాణంలో వ్యాపారం చేయడంగాని, కష్టపడి ఉపాధి సంపాదించడం గాని ధర్మసమ్మతమైంది కాదు అని భావించేవారు. అనేకమంది హజ్ కాలంలో అన్న పానీయాల్ని మానివేసి దాన్ని ఆరాధనగా భావించేవారు. చాలామంది హజ్ కోసం బయలుదేరేటప్పుడు మౌనవ్రతాన్ని బూనేవారు. దీన్ని వారు 'హజ్జె ముస్‌మిత్' (మూగ హజ్) అనేవాళ్ళు. ఇలాంటివే అనేక తప్పుడు ఆచారాలు ఉండేవి. వాటన్నిటిని వివరిస్తూ మీ కాలాన్ని వృథా చేయదలచలేదు.

ఈ పరిస్థితి దాదాపు రెండువేల ఏండ్ల వరకు కొనసాగింది. ఈ సుదీర్ఘకాలంలో అరేబియా దేశంలో ప్రవక్తల స్వచ్ఛమైన బోధనలు ఏవీ అరేబియా ప్రజలకు అందలేదు. చివరికి హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స), కాబాగృహ గోడల్ని నిర్మిస్తూ అల్లాహ్‌ను వేడుకున్న ప్రార్థన ఫలించేకాలం ఆసన్నమైంది. ఆ ప్రార్థన :

'ఓ ప్రభూ! వీరి నడుమ ఓ ప్రవక్తను స్వయంగా వీరి జాతినుండే, వీరికి నీ సూచనలను వినిపించి గ్రంథజ్ఞాన బోధనలను వినిపించి వారి నైతికతలను బాగుపర్చడానికి ప్రభవింపజెయ్యి.' తరువాత, హజ్రత్ ఇబ్రాహీమ్ సంతతినుండే ఓ పరిపూర్ణ మానవుడు ప్రభవించాడు ఆయన పేరే 'ముహమ్మద్ బిన్ అబ్దుల్లాహ్' (సల్లల్లాహు అలైహి వ సల్లం). హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) ఎలా పురోహితులు, పండితుల కుటుంబంలో జన్మించారో, హజ్రత్ ముహమ్మద్ (సఅసం) కూడా శతాబ్దాల తరబడి కాబా గృహ తీర్థస్థలానికి పండితులు, పూజారుల కుటుంబంలో జన్మించారు. హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) స్వయంగా తన వంశ పౌరోహిత్యంపై వ్రేటువేసినట్లే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) కూడా దానిపై వ్రేటు వేశారు. అంతేకాదు, దాన్ని మొదలంట తుడిచివేశారు. ఇంకా, హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) మూఢనమ్మకాలను, అసత్యదైవాల దైవత్వాన్ని తుదముట్టించేందుకు ఎలా పరిశ్రమించారో, ఏకేశ్వరుని దాస్యప్రచారాన్ని వ్యాపింపజేయడానికి ఎలా కృషిచేశారో అదేవిధంగా మహాప్రవక్త (సఅసం) ఆ స్వచ్ఛమైన, దైవధర్మాన్నే పునఃప్రతిష్ఠించారు. ఇరవై ఒక్క సంవత్సరాల కాల వ్యవధిలో ఈ పనిని పూర్తిచేసి, దైవాదేశం మేరకు తిరిగి కాబాగృహాన్ని సర్వ ప్రపంచపు దైవారాధకుల కేంద్రంగా చేస్తున్నట్లు ప్రకటించారు అంతిమ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం). అన్నివైపులనుండి హజ్ కోసం రండి అని పిలుపునిచ్చారు.

> "ప్రజలపై అల్లాహ్‌కు ఉన్న హక్కు ఏమిటంటే, ఈ గృహానికి వెళ్ళే శక్తిగలవారు దాని హజ్‌ను విధిగా చేయాలి. ఈ ఆజ్ఞను పాలించటానికి తిరస్కరించేవాడు అల్లాహ్‌కు ప్రపంచ ప్రజల అవసరం ఎంతమాత్రం లేదు అని స్పష్టంగా తెలుసుకోవాలి." *(ఆలి ఇమ్రాన్ : 97)*

ఇలా హజ్ ఆరాధనను పునఃప్రారంభించి, రెండు వేల సంవత్సరాల తరబడి వేళ్ళూనికొనిపోయిన దురాచారాలన్నిటిని నామరూపాల్లేకుండా చెరిపేయడం జరిగింది.

కాబా గృహంలో ప్రతిష్ఠించబడిన విగ్రహాలన్నీ తునాతునకలయ్యాయి. అక్కడ జరిగే దైవేతరశక్తుల పూజాపురస్కారాలన్నీ ఆపుచేయబడ్డాయి. ఆ ఆచారాలన్నీ రూపుమాసిపోయాయి. జాతర్లు, ఉత్సవాలన్నింటిని అంతం చేయడం జరిగింది. ఇక ఇప్పుడు ఏ ఆరాధనా విధానం అయితే చూపబడుతుందో దాని ప్రకారమే అల్లాహ్‌ను ఆరాధించవలసి ఉంటుందని చెప్పడం జరిగింది.

*"అల్లాహ్ మీకు బోధించిన విధంగా ఆయనను స్మరించండి. వాస్తవానికి మీరు పూర్వం మార్గం తప్పి నడిచేవారు." (అల్ బఖర: 198)*

దుర్మార్గపు కార్యకలాపాలన్నీ నిషేధించడం జరిగింది.

*"హజ్ సమయంలో అతడు కామ చేష్టలకూ, దుష్కార్యాలకూ, ఘర్షణలకూ దూరంగా ఉండాలి." (అల్ బఖర : 197)*

పొగడ్తలు, తాతతండ్రుల ఘనకార్యాల అతిశయోక్తి, కవిసమ్మేళనాలు, ఒకరినొకరు తూలనాడుకోవడం అన్నీ అరికట్టబడ్డాయి.

*"మీ హజ్ విధులను ముగించిన తరువాత, మీరు మీ తాతముత్తాతలను పూర్వం స్మరించేవిధంగానే, ఇంకా దానికంటే అధికంగానే అల్లాహ్‌ను స్మరించండి." (అల్ బఖర : 200)*

కేవలం ప్రదర్శనాబుద్ధితో, కీర్తికండూతికోసం ఏర్పాటుచేసే దాతృత్వపోటీలు అంతమొందించడం జరిగింది. వాటి స్థానంలో ఇబ్రాహీమ్ (అ.స) నాటి పద్ధతి అంటే కేవలం అల్లాహ్ పేరున జంతువులను జిబహ్ చేసేపద్ధతిని ప్రవేశపెట్టడం జరిగింది. సంపన్నులు చేసే బలిదానం నుండి పేద హాజీలు కూడా భుజించే అవకాశం కలిగింది ఈ విధానంలో.

*'తినండి, త్రాగండి, మితిమీరకండి. అల్లాహ్ మితిమీరేవారిని ప్రేమించడు.'*

*(అల్ ఆరాఫ్: 31)*

"కనుక వాటిని నిలబెట్టి వాటిపై అల్లాహ్ పేరును స్మరించండి. (ఖుర్బానీ తరువాత) వాటి వీపులు నేలపై ఆనినప్పుడు వాటిలో నుండి స్వయంగానూ తినండి, (యాచించని) సంతుష్టులకూ తినిపించండి, తమ అవసరాలకు అడిగేవారికీ తినిపించండి." *(అల్ హజ్: 36)*

ఖుర్బానీ రక్తాన్ని కాబాగోడలకు పులమడం, మాంసాన్ని ద్వారం దగ్గర పడేయడాన్ని నిలిపివేయడం జరిగింది. దివ్య ఖుర్ఆన్ ఇలా అంటోంది.

"అల్లాహ్‌కు జంతువుల మాంసంగాని, రక్తంగాని చేరవు. కాని మీ భయభక్తులు ఆయనకు చేరుతాయి." *(అల్ హజ్ : 37)*

నగ్నంగా ప్రదక్షిణాలు చేయడాన్ని కఠినంగా వారించడం జరిగింది.

"ప్రవక్తా! వారితో ఇలా అను: 'అల్లాహ్ తన దాసుల కొరకు ఉద్భవింపజేసిన మంచి వస్త్రాలను ఎవరు నిషేధించారు." *(అల్ ఆరాఫ్ : 32)*

"ఓ ప్రవక్తా! సిగ్గుమాలిన పనిని అల్లాహ్ ఎన్నటికీ ఆదేశించడు." *(అల్ ఆరాఫ్ : 28)*

"ఆదం సంతానమా! ప్రతి ఆరాధనా సమయంలో మీ వస్త్రాలంకరణపట్ల శ్రద్ధవహించండి." *(అల్ ఆరాఫ్ : 31)*

హజ్ మాసాలను తారుమారు చేయడం, హరాం (నిషిద్ధ) మాసాలను పోరాటాల కోసం ధర్మసమ్మతం (హలాల్) చేసుకోవడాన్ని కఠినంగా వారించడం జరిగింది.

" 'నసీ' అవిశ్వాసంలో ఒక అదనమైన అవిశ్వాసపు చేష్ట. దానిద్వారా ఈ అవిశ్వాసులు మార్గభ్రష్టతకు గురిచేయబడతారు. ఒక సంవత్సరం ఒక మాసాన్ని ధర్మసమ్మతం చేసుకుంటారు, మరొక సంవత్సరం దానినే నిషిద్ధం చేసేస్తారు. అల్లాహ్ నిషిద్ధం చేసిన మాసాల సంఖ్యను పూర్తి

*చేయాలనీ, అల్లాహ్ నిషిద్ధం చేసిన దానిని ధర్మసమ్మతం చేసుకోవాలని కూడా." (అత్ తౌబా : 37)*

ప్రయాణ సామగ్రి లేకుండా హజ్ కోసం బయలుదేరడాన్ని నిషేధించడం జరిగింది.

*"హజ్ యాత్రకు ప్రయాణ సామగ్రిని తీసుకువెళ్ళండి. భయభక్తులు అన్నిటికంటే ఉత్తమమైన సామగ్రి." (అల్ బఖర : 197)*

హజ్‌యాత్రలో ఎలాంటి ఉపాధి సంపాదించకపోవడాన్ని పుణ్యంగా, ఉపాధి సంపాదన పాపంగా పరిగణించడాన్ని ఖండిస్తూ ఇలా సెలవిచ్చింది దివ్య ఖుర్ఆన్.

*"హజ్ యాత్రతో పాటు మీరు అల్లాహ్ అనుగ్రహం అన్వేషిస్తే అందులో దోషం లేదు." (అల్ బఖర : 198)*

మూగ హజ్‌ను, ఆకలిదప్పులతో చేసే హజ్‌ను కూడా నిషేధించడం జరిగింది. ఇలాగే అజ్ఞానకాలం నాటి ఇతర ఆచారాలను తుదముట్టించి హజ్ ఆరాధనను దైవభీతితో కూడిన, పవిత్రమైన, నిరాడంబరమైన ఆరాధనగా చేయడం జరిగింది. హాజీలు, హజ్ కోసం ఇండ్లనుండి బయలుదేరగానే ప్రాపంచిక వ్యాపకాలకు దూరంగా ఉండాలని, కామాన్ని విడనాడి తమ భార్యల్తో ఆ కాలంలో లైంగిక సంబంధాల్ని పెట్టుకోకూడదని, తిట్లకు, దుర్భాషలకు ఇతర దుష్కార్యాలకు స్వస్తి చెప్పాలని ఆదేశించడం జరిగింది. కాబాకు వచ్చే మార్గాలన్నిటికీ కొన్ని మైళ్ళదూరంలో ఒక్కో హద్దును నిర్ణయించడం జరిగింది. ఆ హద్దుల్ని దాటే ముందు ప్రతి హాజీ తన దుస్తుల్ని మార్చి 'ఇహ్రామ్' దుస్తులు అనే సాధువుల దుస్తులు వేసుకోవాలి. ఇలా ఈ ఇహ్రామ్ దుస్తులు ధరించడం వల్ల ధనికులు పేదలు, జాతుల వ్యత్యాసాలు నమసిపోతాయి. అందరూ ఆ అల్లాహ్ దర్బారులో ఒక్కటే. ఫకీరులుగా మారి యాచిస్తూ హాజరు కావలసిందే. 'ఇహ్రామ్' కట్టుకున్న

తరువాత మనిషి రక్తాన్ని చిందించడం అటుంచి, జంతువులను సైతం వేటాడ్డం హరాం (నిషిద్ధం) చేయడం జరిగింది. తద్వారా మనిషిలోని పశుత్వం పోయి ఆధ్యాత్మికత, శాంతి నెలకొంటాయి. హజ్‌కు సంబంధించిన నాలుగు నెలలు హరాం చేయబడ్డాయి. తద్వారా ఈ కాలంలో ఏ పోరాటం జరక్కుండా కాబా గృహానికి వెళ్ళే మార్గాలన్నింటిలోను శాంతి నెలకొని యాత్రికుల జోలికి ఎవరూ పోకుండా చేయడం జరిగింది. ఇలా హజ్ యాత్రికులు హరం (కాబా గృహం) లో చేరాక అక్కడ వారికోసం ఎలాంటి ఉత్సవంగాని, జాతరగాని, ఆటపాటలుగాని దర్శనమివ్వవు. అడుగడుగునా దైవనామ స్మరణ, నమాజులు, ఆరాధనలు, ఖుర్బానీలు, కాబా ప్రదక్షిణలు, ఇంకా ఏదైనా వినబడితే అది "లబ్బైక అల్లాహుమ్మ లబ్బైక్. లా షరీకలక లబ్బైక్. ఇన్నల్‌హమ్ద వన్నిఇమత లక వల్‌ముల్క్, లా షరీకలక్" అన్న నినాదాలే. (హాజరయ్యాను ఓ నా అల్లాహ్ హాజరయ్యాను, హాజరయ్యాను. నీకు భాగస్వామి ఎవ్వడూ లేడు. నేను హాజరయ్యాను. నిశ్చయంగా సకల స్తోత్రాలు నీకే. వరాలన్నీ నీవే. అధికారం నీదే. నీకు భాగస్వామి ఎవరూ లేడు.)

పరిశుద్ధమైన, పవిత్రమైన, చిత్తశుద్ధితో కూడుకున్న హజ్ గురించి దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

"అల్లాహ్ కోసం హజ్ చేసినవారు, ఆ హజ్‌లో కామోద్రేకాలను, పాప కార్యాలను త్యజించినవారు, తమ మాతృగర్భాలనుండి పుట్టిన వారిలా మారిపోతారు."

హజ్ ప్రయోజనాల గురించి చెప్పే ముందు, ఈ ఫర్జు (విధి) ఎలాంటిదో మీకు చెప్పడం అవసరం అనుకుంటాను. దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

*"ప్రజలపై అల్లాహ్‌కు ఉన్న హక్కు ఏమిటంటే, ఈ గృహానికి వెళ్ళే శక్తిగలవారు దాని హజ్‌ను విధిగా చేయాలి. ఈ ఆజ్ఞను పాలించడానికి*

*తిరస్కరించేవాడు అల్లాహ్‌కు ప్రపంచ ప్రజల అవసరం ఎంతమాత్రం లేదు అని స్పష్టంగా తెలుసుకోవాలి." (అలి ఇమ్రాన్ : 97)*

ఈ ఆయత్‌లో స్తోమత ఉండి కూడా కావాలని హజ్ చేయకపోవడాన్ని 'కుఫ్ర్' (తిరస్కారం)గా చెప్పడం జరిగింది. దైవప్రవక్త (సఅసం) ప్రవచనాలు రెండు విషయాల్ని మరీ విపులంగా వివరిస్తున్నాయి.

"బైతుల్లాహ్ (దైవగృహం) వరకు వెళ్ళగలిగే వాహనం, ప్రయాణ సామగ్రి కలిగి వుండేవ్యక్తి హజ్ చేయక చనిపోతే అతడు యూదునిగా, నస్రానీ (క్రైస్తవుని)గా చావడం లాంటిదే."

"ఒక వ్యక్తికి ఏ అవసరమూ అడ్డుకోకపోయినా లేక దౌర్జన్యపరుడైన పాలకుడు వారించకపోయినా ఇంకా మరే వ్యాధికూడా అవాంతరం కాకపోయినా, అట్టి పరిస్థితిలో అతడు హజ్ చేయకపోతే, అదే స్థితిలో అతను చనిపోతే అతడు యూదునిగా, క్రైస్తవునిగా చనిపోయినా ఒక్కటే."

దీన్నే హజ్రత్ ఉమర్ (రజిఅన్) ఈ విధంగా వివరించారు:

"ఎవరైతే స్తోమత ఉండి కూడా హజ్ చేయరో వారిపై 'జిజియా' విధించాలనే ఆలోచన నాకు వస్తుంది. వారు ముస్లిములు కారు, నిజంగా వారు ముస్లిములు కారు."

అల్లాహ్ యొక్క ఈ ఆదేశం, దైవప్రవక్త (సఅసం) వివరణ వల్ల ఈ విధిని గురించి మీకు ఇప్పటికే అర్థమై ఉంటుంది. ఇష్టమొచ్చినప్పుడు ఆచరించడం లేకుంటే లేదు అనుకునే విధి కాదిది. కాబాగృహం వరకు వెళ్ళిరాగలిగే స్తోమత కలిగి, కాళ్ళూ చేతులు సక్రమంగా ఉన్న ప్రతివాడు తన జీవితంలో ఓసారి తప్పకుండా దీన్ని ఆచరించి తీరాల్సిన విధి ఇది. అతడు ప్రపంచంలోని ఏ మూలన వున్నాసరే. అతనిపై భార్యాపిల్లల పోషణ భారంవున్నా, ఉద్యోగానికి సంబంధించిన బాధ్యతలున్నా దీన్ని నెరవేర్చాల్సిందే. ఎవరైతే స్తోమతా, శక్తి ఉండి

కూడా దీన్ని దాటేస్తుంటారో, వేలాది వ్యాపకాలను సాకుగా చెబుతూ సంవత్సరాలకు సంవత్సరాలే ఇలా గడిపేస్తూ ఉంటారో వాళ్ళు వారి విశ్వాసాల్ని రక్షించుకోవలసి ఉంది. ఇకపోతే, హజ్ అనే విధిని తాము ఆచరించవలసివుంది అనే ధ్యాసే లేనివారు కూడా ఉన్నారు. అలానే ప్రపంచం మొత్తాన్నే చుట్టేసి వస్తుంటారు. తాము కాబా సమానంగా భావించే యూరపును చుట్టిముట్టి వస్తారు, మక్కా కొన్ని మైళ్ళ దూరాన వున్నా అరేబియా తీరం మీదుగా కూడా పయనిస్తూ వుంటారు. కాని హజ్ చేసే ఆలోచనే వారికి రాదు. అలాంటివారు ముస్లిములే కారు. వారు తమను తాము ముస్లిములుగా చెప్పుకోవడం వట్టి బూటకం. వారిని ముస్లిములుగా భావించే వాళ్ళకు ఖుర్ఆన్ ఏం చెబుతోందో తెలియదు. ముస్లిముల ఎడల సానుభూతి ఉంటే వారికుండవచ్చు. కాని అల్లాహ్ ఆజ్ఞాపాలనా ఉద్దేశ్యం, ఆయన ఆదేశాలపై విశ్వాసం మాత్రం వారి హృదయాల్లో లేదు.

## హజ్ ప్రయోజనాలు

ముస్లిము సోదరులారా! దివ్య ఖుర్ఆన్‌లో హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స)ను హజ్ గురించి ప్రకటించమని ఆదేశం ఇచ్చిన చోటే ఆ ఆదేశపు ప్రధాన కారణం ఏమిటో చెప్పడం జరిగింది. అది ఇలా ఉంది, "ప్రజలు ఇక్కడికి వచ్చి, ఈ హజ్‌లో వారికి ఎలాంటి ప్రయోజనాలున్నాయో చూడాలి"అని. అంటే హజ్ ప్రయాణం చేసి ఇక్కడ సమావేశమై, స్వయంగా తమ కళ్ళతో వారే చూస్తారు - ఇందులో ఎలాంటి లాభాలు నిక్షిప్తమై ఉన్నాయో. మనిషి దాన్ని ఆచరిస్తేగాని అందులో నిగూఢంగా ఉన్న ప్రయోజనాలు అతనికి కనబడవు. హజ్రత్ అబూ హనీఫా (రహ్మలై) గారి ఓ ఉల్లేఖనం ఏమిటంటే ఆయన హజ్‌కు వెళ్ళకపూర్వం, ఇస్లామీయ ఆరాధనల్లో ఏది ఉత్తమమైనదో నిర్ధారించుకోలేక పోయారు. అయితే ఆయన స్వయంగా చేసినప్పుడు ఆయనకు అందులో దాగి వున్న ఎనలేని

ప్రయోజనాలు కనబడ్డాయి. అప్పుడు ఆయన ఎలాంటి సంశయం లేకుండా, ఇస్లామీయ ఆరాధనల్లోకెల్ల మేలైన ఆరాధన హజ్ మాత్రమే అని ప్రకటించారు.

రండి, ఇప్పుడు స్థూలంగా దాని ప్రయోజనాలేమిటో చెబుతాను.

సాధారణంగా ప్రజలకు రెండు రకాల ప్రయాణాల గురించే తెలుసు. ఉపాధి సంపాదనకోసం చేసే ప్రయాణం ఒకటైతే, వినోదం కోసం పర్యటించడం మరొకటి. ఈ రెండు రకాల ప్రయాణాల్లో అవసరాలు, కోరికలు మనిషిని ప్రేరేపిస్తాయి. ఇంటిని, భార్యాపిల్లల్ని, బంధువర్గాల్ని వదిలి మనిషి బయటకు వెళుతున్నాడంటే, డబ్బు ఖర్చుపెడుతున్నాడంటే అది అతని అభీష్టం నెరవేరాలనే కదా. కాబట్టి ఈ ప్రయాణంలో త్యాగం అన్నది లేనేలేదు. అయితే 'హజ్' అన్న ప్రయాణం తీరేవేరు. ఇది ఇతర ప్రయాణాలకంటే భిన్నమైన ప్రయాణం. ఇది తన అవసరం కోసంగాని, తన కోరికలను తీర్చుకోవడం కోసంగాని చేసే ప్రయాణం కాదు. కేవలం అల్లాహ్ కోసం; తనపై అల్లాహ్ విధించిన ఆ ఫర్జ్‌ను నెరవేర్చడానికి చేసే ప్రయాణం. ఓ మనిషి హృదయంలో దైవప్రేమ, దైవభీతి, ఆయన విధించిన ఆ ఫర్జును 'ఫర్జ్'గా భావించే భావనే లేకపోతే ఈ ప్రయాణానికి సిద్ధమేకాడు మనిషి. కాబట్టి ఎవరైతే తన ఇంటిని, భార్యాపిల్లల్ని, బంధుమిత్రుల్ని ఎడబాసి తన వ్యాపార వ్యవహారాల నష్టాన్ని, తన ధన వ్యయాన్ని, ప్రయాణ బడలికను అన్నిటికీ ఓర్చి సంతోషంగా హజ్ కోసం బయలుదేరుతాడో అతని ఈ బయలుదేరడం అతనిలో దైవప్రేమ, దైవభీతి, దైవం విధించిన విధిని విధిగా తలిచే ఆలోచన ఉంది అనడానికి నిదర్శనం. అదేవిధంగా, ఎప్పుడైనా దైవమార్గంలో బయలు దేరవలసి వస్తే సంశయించకుండా బయలుదేరే శక్తి అతనికి ఉందని, ప్రయాణంలో వచ్చే కష్టనష్టాలను ఎదుర్కోగలడని, తన సొత్తును, తన సుఖాన్ని దైవప్రసన్నత కోసం త్యాగం చేయగలడని నిరూపించుకునే సత్తా అతనికి ఉందనుకోవాలి.

ఇక అతడో పవిత్రమైన ఉద్దేశ్యంతో ఈ ప్రయాణానికి బయలుదేరినప్పుడు అతని మానసిక స్థితి మారిపోతుంది. ఆ మనస్సులో దైవప్రేమ ఉరకలు వేస్తుంది.

ఇలా ప్రయాణమైనప్పుడు ఆ హృదయంలో పుణ్యప్రదమైన ఆలోచనలే జనిస్తాయి. పాపాలకు పశ్చాత్తాపపడతాడు, తన చేతల గురించి చేతులెత్తి మన్నించమని దైవాన్ని వేడుకుంటాడు. తన వారందరిని కలిసి ఒక్కొక్కరితో తనను క్షమించమని కోరుకుంటాడు. తనపై ఉన్న హక్కుల బరువును మోస్తూ దైవ సన్నిధికి చేరడం ఇష్టముండదు కనుక చెడు ఎడల అతనికి ఏహ్య భావం కలుగుతుంది. సహజంగానే సత్కర్మలవైపునకు మొగ్గుతాడు. ఇక ప్రయాణమైన వెంటనే దైవగృహం దెగ్గరవుతున్నకొద్దీ అతని మనస్సులో పుణ్యకార్యాలకు సంబంధించిన భావాలే అధికమౌతూ ఉంటాయి. ఎవ్వరికీ తన వల్ల కష్టం కల్గించకుండా సాధ్యమైనంతవరకు ఒకరికి సహాయపడాలనే ఆతురత అధికమౌతుంది. పరుష వాక్యాలు, అశ్లీలం, అన్యాయం, అకృత్యం, అవినీతి, పోట్లాటల గురించి దూరంగా ఉండాలనే కోరుకుంటాడు. అతని ప్రయాణమంతా ఆరాధనే. ఈ ఆరాధనలో అకృత్యాలకు స్థానమేమిటి? ఇలాంటి సిగ్గుమాలిన పనులన్నీ అతడెలా చేయగలడు? మొత్తానికి ఇతర ప్రయాణాలకు భిన్నంగా ఈ ప్రయాణం మనిషి మనస్సును ప్రక్షాళిస్తుంది. మరోవిధంగా చెప్పాలంటే ఇది గొప్ప సంస్కరణా సమయం. హజ్ ఆరాధన కోసం వెళ్ళే ప్రతి ముస్లిమ్ తప్పకుండా దీన్ని పూర్తి చేయవలసి ఉంటుంది.

ప్రయాణంలోని ఓ భాగం పూర్తిచేసిన తరువాత ఓ ప్రత్యేకమైన హద్దు వస్తుంది. అక్కణ్ణుంచి మక్కాకు వెళ్ళే ప్రతి ముస్లిమ్ ఇహ్రామ్ కట్టుకోకుండా ముందుకు వెళ్ళడానికి వీల్లేదు. ఆ ఇహ్రామ్ అంటే ఏమిటి? ఓ సాధువు ధరించే దుస్తులు. ఓ లుంగీ, ఓ దుప్పటి, ఓ జత చెప్పులు తప్ప మరేవీ ఉండవు అందులో, అంటే ఇప్పటి వరకు మీరు ఎలా ఉన్నా ఇప్పుడు దైవ దర్బారులో వెళ్ళాల్సి ఉంది. కాబట్టి వెళ్ళేటప్పుడు ఓ ఫకీరులా, ఓ సాధువులా వెళ్ళండి, పైకే కాదు మానసికంగా కూడా ఫకీరులా మారే యత్నం చేయండి. రంగురంగులు కలిగిన అందాల బట్టల్ని తీసేయండి. సాధువులు వేసుకొనే సాధారణ బట్టల్నే వేసుకోండి. మేజోళ్ళు కూడా వద్దు. తలకు ఆచ్ఛాదనా వద్దు. సువాసనా ద్రవ్యాలు కూడా పులుము

కోకూడదు. క్షవరం కూడా చేసుకోవద్దు. అన్ని రకాల అలంకారాల్ని త్యజించండి. లైంగిక సంబంధాల్ని వీడండి. ఆ భావాలను ప్రేరేపించే ప్రతి విషయానికి దూరంగా ఉండండి. వేటాడకండి. వేటగానికి వేటకు సంబంధించిన సూచనలు కూడా ఇవ్వకండి. మీరిలా మారిపోతే ప్రత్యేకంగా ఈ ప్రభావం మీ అంతర్యంపై కూడా పడుతుంది. లోపలినుండి మీ హృదయం ఫకీరులా మారుతుంది. మీలోని అహం నశిస్తుంది. సాధుస్వభావం, శాంతం మీలో నెలకుంటుంది. ప్రాపంచిక వ్యాపకాల్లో, మనోవాంఛల్లోను చిక్కుకొని ఉన్న మీ అంతరాత్మ ప్రక్షాళింప బడుతుంది. దైవచింతన దైవభీతి అంతర్గతంగా, బహిర్గతంగాను మీలో చోటు చేసుకుంటాయి.

ఇహ్రాం కట్టుకున్న తరువాత, ప్రతి నమాజైన వెంటనే, ప్రతి మెట్ట ప్రదేశాన్ని ఎక్కేటప్పుడు, ప్రతి పల్లానికి దిగేటప్పుడు ప్రతి బృందంతో కలిసేటప్పుడు, ప్రతి ఉదయం మేల్కొన్నప్పుడు ఓ హాజి నోట వెలువడే పలుకులు;

"లబ్బైక్ అల్లాహుమ్మ లబ్బైక్, లబ్బైక లాషరీక లకలబ్బైక, ఇన్నల్‌హమ్ద వన్నిఇమత లక వల్‌ముల్క్. లాషరీకలక్."

నాల్గున్నర వేల సంవత్సరాల క్రితం హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స) చేసిన నినాదానికి జవాబుగా పలికే వచనాలివి. నలభై అయిదు శతాబ్దాలు గడిచిపోయాయి.

"ఓ దైవదాసుల్లారా! భూమండలంలోని ప్రతి మూలనుండి అల్లాహ్ గృహం వైపునకు రండి. కాలి నడకన, వాహనాలపైనా రండి" అని మొదట చాటింపు వేయడం జరిగింది. దానికి జవాబుగా నేడు "నేను హాజరయ్యాను ఓ ప్రభూ నేను హాజరయ్యాను. నీకెవరూ భాగస్వామి కాడు, నీ పిలుపుకే హాజరయ్యాను. స్తోత్రమూ నీదే, వరాలూ నీవే, దేశం నీదే. ఎందులోనూ నీ భాగస్వామి ఎవడూ లేడు" అని ప్రతి హజ్ యాత్రికుడు బిగ్గరగా పలుకుతున్నాడు. ఇబ్రాహీమ్ (అ.స), ఇస్మాయీల్ (అ.స)ల కాలంనుండి కొనసాగుతూ వస్తున్న శుద్ధమైన, సత్యమైనదైన దైవభక్తి ఉద్యమంతో, ఈ లబ్బైక్ నినాదం ద్వారా ప్రతి హాజీకి సంబంధం

ఏర్పడుతుంది. నాలుగు వేల సంవత్సరాల అంతరం ఇట్టే తొలగిపోతుంది. అల్లాహ్ తరపున ఇబ్రాహీమ్(అ.స) పిలుస్తుంటే సమాధానంగా 'లబ్బైక్' అంటున్నట్లు అనిపిస్తుంది. ఇలా సమాధానమిస్తూ ముందుకు సాగుతాడు హాజీ. ముందుకు సాగినకొద్దీ అతని ఉత్సాహం మరింత ఉరకలేస్తూ ఉంటుంది. ప్రతి మెట్ట, ప్రతి పల్లపు ప్రదేశంలో అతనికి అల్లాహ్ చేయించిన ఆ చాటింపు శబ్దాలే మార్మోగుతూ ఉంటాయి. దానికతడు 'లబ్బైక్ లబ్బైక్' అంటూ ముందుకు కదుల్తాడు. ప్రతి హజ్ యాత్రికుల బృందం అతనికి ఆ వార్తను తెచ్చేదిగా కానవస్తుంది. అతడో ప్రేమికుని మాదిరిగా ఆ వార్తను విని 'హాజరయ్యాను, హాజరయ్యాను' అని జవాబిస్తాడు. ప్రతి నవోదయం అతనికి ప్రియుని సందేశాన్ని తెస్తుంది. ఉషోదయ వేళ అతడు కళ్ళు తెరవగానే లబ్బైక అల్లాహుమ్మ లబ్బైక్ అంటూ నినదిస్తూ లేస్తాడు. మొత్తానికి మాటిమాటికీ ఇచ్చే ఈ నినాదం, ఆ ఇహ్రామ్ దుస్తులు, ప్రయాణపు ఆ పరిస్థితి, అంతకంతకూ దగ్గరౌతున్న కాబాగృహం, ఆ కాబాగృహ దర్శనాకాంక్ష అన్నీ కలిసి హాజీని దైవప్రేమలో పిచ్చివాణ్ణిగా చేస్తాయి.

ఈ పరిస్థితిలోనే మక్కా చేరిన అతడు తనను, తన వైపునకు పిలిచిన ఆ కాబాగృహం వైపునకు నేరుగా పరుగిడుతాడు. దాన్ని ముద్దెట్టుకుంటాడు. తన నమ్మకానికి, తన ధర్మానికి, తన విశ్వాసానికి కేంద్రబిందువైన ఆ గృహాన్ని ప్రేమాతిశయంతో పరివేష్టిస్తాడు, ప్రతి ప్రదక్షిణం ప్రియుని గడపకు ముద్దు పెట్టుకునే ప్రారంభిస్తాడు, ముద్దు పెట్టుకునే ముగిస్తాడు.★ ఆ తరువాత మకామె ఇబ్రాహీమ్ వద్ద రెండు రకాఅత్‌ల నమాజు చేస్తాడు. అక్కణ్ణుంచి సఫా కొండను అధిరోహిస్తాడు. ఆ కొండపైనుంచి కాబాగృహంపై దృష్టిపడగానే బిగ్గరగా ఇలా పలుకుతాడు. "లా ఇలాహ ఇల్లల్లాహు వలానఅబుదు ఇల్లా ఇయ్యాహు ముఖ్లిసీన లహుద్దీన వలౌకరిహల్ కాఫిరూన్." (అల్లాహ్ తప్ప ఆరాధ్యుడు లేడు. ఇతరులెవ్వరికి మేము దాస్యం

---

★ హజ్రె అస్వద్ (నల్లరాయి)ని ముద్దాడడాన్ని కొందరు అవివేకులు అది ఓ విగ్రహారాధన కాదా అని ఆక్షేపిస్తారు. అయితే అది కేవలం ముద్దుపెట్టుకోవడం తప్ప మరేది కాదు. కాబాగృహ ప్రదక్షిణ హజ్రె అస్వద్ ముందునుంచే ప్రారంభించడం

చేయం. మా దాస్యం కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకం. ఇది తిరస్కారులకు ఎంత బాధ కలిగించినా సరే).

ఆ తరువాత సఫా, మర్వా కొండలనడుమ పరుగులు తీస్తాడు. అంటే తన ప్రభువు సేవలో ఆయన ప్రసన్నతకై ఇలాగే సతతం కృషిచేస్తూ ఉంటానని రుజువు చేస్తున్నాడన్నమాట. ఈ 'సయీ' (పరుగుల) సందర్భంగా ఒక్కొక్కప్పుడు అతని నోట ఈ పలుకులు వినవస్తాయి.

*"అల్లాహుమ్మస్‌త అమల్నీ బిసున్నతి నబియ్యిక వతవప్పనీ అలా మిల్లతిహీ వఅఇద్‌నీ మిమ్‌ముజిల్లాతిల్ ఫితన్."*

(దైవమా! నీ ప్రవక్త ఏ మార్గాన్నైతే, ఏ విధానాన్నైతే ఆచరించారో నన్ను ఆ విధానాన్ని అనుసరించేటట్లు చెయ్యి. నీ ప్రవక్త మార్గంలోనే నాకు మరణాన్ని ప్రసాదించు. జీవితంలో నన్ను మార్గభ్రష్టునిగా చేసే పరీక్షలనుండి కాపాడు).

అప్పుడప్పుడు ఈ పదాలు కూడా అతని నోటినుండి వెలువడుతూ ఉంటాయి.

*"రబ్బిగ్‌ఫిర్ వర్హం వతజావజ్ అమ్మాత'అలము ఇన్నక అంతల్ అఅజ్జుల్ అక్రమ్."*

(ప్రభూ! మన్నించు, కరుణించు, నా తప్పులు నీకు తెలుసు. వాటిని క్షమించు. నీ శక్తి అన్నిటికన్నా మిన్న. నీ కార్యం కూడా అన్నిటికన్నా ఘనం).

---

*జరుగుతుంది. ఏడు ప్రదక్షిణల్లో ప్రతి ప్రదక్షిణలో చివరన హజ్రె అస్వద్‌ను ముద్దుపెట్టుకోవడమో లేక దానివైపు సంకేతం చేయడమో జరుగుతుంది. ఇందులో ఈ నల్లరాయిని పూజించే భావన ఏమాత్రం లేదు. హజ్రత్ ఉమర్ (రజిఅన్) ఈ విషయంలో, హజ్రె అస్వద్‌ను సంబోధిస్తూ ఇలా అన్నారు: "నాకు తెలుసు నువ్వు కేవలం ఒక రాయి మాత్రమేనని, దైవప్రవక్త మహనీయులు (సఅసం) నిన్ను ముద్దాడకపోతే నేనూ ముద్దాడేవాణ్ణి కాను."*

దీని తరువాత అతడు అల్లాహ్ సిపాయిలా అయిదు రోజులు క్యాంపులో గడపాల్సి వస్తుంది. ఓ రోజు 'మినా'లో విడిదిచేస్తే మరునాడు అరఫాత్‌లో క్యాంపు వేస్తాడు. 'ఖుత్బా' (ప్రసంగం)లో కమాండరు ఆదేశాల్ని శ్రద్ధగా వింటాడు. రాత్రి 'ముజ్‌దలిఫా'లో గడిపి తెల్లారగానే మినాకు బయలుదేరుతాడు. అక్కడ ఒకప్పుడు కాబా గృహాన్ని నేలమట్టం చేయడానికి వచ్చిన 'అస్హాబిల్‌ఫీల్' (ఏనుగులవాళ్ళు) వచ్చి ఆగిన దానికి గుర్తుగా పాతిన రాతి స్తంభంపై గులకరాళ్ళను విసురుతూ ఆ అల్లాహ్ సిపాయి, "అల్లాహు అక్బర్ రగ్మన్ లిష్షైతాని వహిస్‌బిహీ, అల్లాహుమ్మ తస్దీఖమ్ బికిలూబన్ వ ఇత్తిబాఅల్ లిసున్నతి నబియ్యిక్" అంటూ పలుకుతాడు. గులకరాళ్ళు విసరడంలోగల ఔచిత్యం ఏమిటంటే - దైవమా ఎవరైతే నీ ధర్మాన్ని తుదముట్టించడానికి ప్రయత్నిస్తారో ఆ ప్రయత్నాలను వమ్ముచేసి నీ ధర్మోన్నతికోసం ఈ విధంగా పోరాడుతాను అని. అక్కణ్ణే ఖుర్బానీ కూడా చేస్తాడు. ఇలా ఖుర్బానీ చేయడం వలన దైవమార్గంలో రక్తాన్ని చిందించే సంకల్పం కార్యరూపంగా బహిర్గతం కావాలన్నదే. అక్కడనుండి కాబా గృహం వైపునకు, ఓ సిపాయి తన డ్యూటీని పూర్తిచేసుకొని హెడ్ క్వార్టర్సుకు మరలినట్లుగా మరలడం జరుగుతుంది. ప్రదక్షిణ (తవాఫ్), రెండు రకాఅత్‌ల నమాజు ముగించుకొని ఇహ్రామ్ విప్పివేస్తాడు. ఇహ్రామ్ కట్టుకున్నప్పుడు హరాం అయినదంతా హలాల్‌గా మారిపోతుంది. ఇప్పుడు హాజి జీవితం తిరిగి మామూలుగా ప్రారంభం అవుతుంది. ఇలా మామూలు జీవితంలోకి తిరిగి అడుగు బెట్టిన తరువాత హాజి, మినాకు వెళ్ళి తిరిగి క్యాంపు వేస్తాడు. మరునాడు 'జమ్రాత్' అనే మూడు రాతిస్థంభాలపై రాళ్ళు విసురుతాడు. ఇవి ఏనుగుల వాళ్ళ సైన్యం పరాజయానికి చిహ్నాలు. దైవప్రవక్త (సఅసం) జన్మించిన సంవత్సరంలోనే హజ్ కాలంలో దైవగృహాన్ని కూల్చడానికి వచ్చిందా ఏనుగుల వాళ్ళ సైన్యం. అల్లాహ్ ఆదేశం మేరకు ఆకాశం నుండి వచ్చిన పిచ్చుకల గుంపు చిన్న చిన్న కంకరరాళ్ళను విసిరి హతమార్చాయి ఆ సైన్యాన్ని.*

---

* సాధారణంగా ఈ రాళ్ళు రువ్వే లాంఛనం హజ్రత్ ఇబ్రాహీమ్ అస్సలామ్‌కు

తిరిగి మూడో రోజున ఆ స్తంభాలపై రాళ్ళు రువ్విన తరువాత హాజీ మక్కాలోనికి వస్తాడు. ఏడు పర్యాయాలు తన కేంద్రం ప్రదక్షిణ చేస్తాడు. దీన్ని 'తవాఫె విదా' అంటారు. ఇది ముగిసిందంటే హజ్ ముగిసింది అని అర్థం.

ఈ వివరాలన్నిటిని దృష్టిలో ఉంచుకొని, హజ్ సంకల్పంతో హజ్ చేయడానికి బయలుదేరడం మొదలుకుని తిరిగి ఇంటికి చేరే వరకు దాదాపు రెండు మూడు నెలల కాలం★ పడుతుంది. ఈ కాలంలో మనిషి హృదయంపై ఎలాంటి ప్రభావాలు పడతాయో మీరే ఊహించండి. ఇందులో సమయత్యాగం, ధనత్యాగం, తన సౌలభ్యాల త్యాగం, ఇంకా అనేక త్యాగాలున్నాయి. ఇదేవిధంగా ప్రాపంచిక సంబంధాల త్యాగమూ ఉంది; అనేక మానసిక కోరికల త్యాగమూ ఉంది. ఇదంతా కేవలం అల్లాహ్ కోసమేకదా. మరే స్వార్థం కానరాదు ఇందులో. ఇక ఈ యాత్రలో దైవభీతితో పాటు ఎడతెగని దైవనామస్మరణ, దైవంపట్ల శ్రద్ధాభక్తులు, ప్రేమ జనిస్తాయి. ఇవి మనిషి హృదయంపై శాశ్వతమైన ముద్రవేస్తాయి. ఈ ముద్ర అతని మనసులో సంవత్సరాల తరబడి నిలిచి ఉంటుంది. 'హరం' (కాబాగృహం) భూభాగంపై కాలుమోపినవాడు, అల్లాహ్ దాస్యంలో, ఆయన ఆరాధనలో తన సర్వస్వాన్నే త్యజించి అందరితో పోరాడి కష్టాలు సహించి

---

తారసపడ్డ పరిస్థితికి జ్ఞాపకార్థంగా జరిగే ఆచారంగా ఖ్యాతి పొందింది. హజ్రత్ ఇస్మాయీల్ (అ.స)ను జిబహ్ చేసేటప్పుడు షైతాన్, ఆయన మనస్సును మార్చడానికి ప్రయత్నం చేస్తే రాళ్ళు రువ్వి వాణ్ణి పారద్రోలారనో లేక హజ్రత్ ఇస్మాయీల్ ప్రాణానికి బదులు ఖుర్బానీకోసం దైవం ప్రసాదించిన గొర్రెపోతు (దుంబా) పరుగెత్తి వెళితే దానికి ఆయన రాళ్ళు రువ్వారని చెప్పుకోవడం పరిపాటి. అయితే గులకరాళ్ళు రువ్వడానికి ఇది కారణం అన్నట్టు ఏ సహీ హదీసులోను లేదు.

★ ఈ ప్రసంగాలు విమానయాన సౌకర్యం అందరికీ లభ్యంకాని రోజుల్లో (1938) చేయబడ్డాయని గమనించాలి.

దేశబహిష్కరణకు లోనై అత్యాచారాలను సైతం భరించి చివరికి అల్లాహ్ నామాన్ని ఆయన కీర్తి ప్రతిష్ఠలను నలువైపుల చాటి, అసత్యవాదులను అణగద్రొక్కిన త్యాగశీలుర చిహ్నాలను అడుగడుగునా దర్శిస్తాడు. ఇలాంటి దైవ నిదర్శనాలను చూసిన దైవభక్తుడు, ధైర్యం, అల్లాహ్ మార్గంలో నిరంతర కృషి జరిపే ప్రేరణ మరే రూపేణా పొందలేడు. ఆపై కాబాగృహ ప్రదక్షిణ ద్వారా, ఈ ధార్మిక కేంద్రంతో ఏర్పడే సంబంధం, హజ్ ఆచరణలో అతడుపడే తాపత్రయం, క్యాంపు వేయడం అక్కడినుండి మరో చోటికి కదలడంలోని అభ్యాసాలను మీరు నమాజు, రోజా, జకాత్‌లతో కలిపిచూడండి. ఇవన్నీ, శిక్షణలా ఇస్లామ్ తన అనుయాయులైన ముస్లిములతో చేయించదలచిన ఓ మహత్కార్యానికి శిక్షణ అని తెలుస్తుంది. అందుకే కాబాగృహం వరకు వెళ్ళి రాగలిగే స్తోమత ఉన్న ప్రతి ముస్లిమ్‌కు హజ్ ఆరాధన విధిగా చేయడం జరిగింది. తద్వారా ప్రతి హజ్ కాలంలో సాధ్యమైనంత ఎక్కువ మంది ముస్లిములు ఈ ట్రైనింగు పొందాలన్నదే ఇస్లామ్ ఉద్దేశ్యం.

ఒక్కొక్క ముస్లిమ్ ఒంటరిగా హజ్ చేయడు. ప్రపంచంలోని ముస్లిముల కోసం, ఒకే కాలం నిర్ణయమైంది. వేలాది లక్షలాది మంది కలిసి ఒకే సమయంలో హజ్ ఆరాధనను నెరవేర్చుతారు అన్న విషయం గనక దృష్టిలో ఉండకపోతే హజ్ ఆరాధనకు సంబంధించిన ప్రయోజనాలను మీరు సరిగా బేరీజు వేసుకోలేరు. వ్యక్తిగతంగా ఓ హాజీపై హజ్ ప్రభావం ఎలా పడుతుందన్నదే నేనింతవరకు చెప్పాను. ప్రపంచ ముస్లిములందరి కోసం ఒకే హజ్ కాలాన్ని నిర్ణయించి ప్రయోజనాల్ని లక్షలాది రెట్లు పెంచడం ఎలా జరిగిందో రాబోయే ప్రసంగంలో వివరిస్తాను. ఇది ఇస్లామ్ గొప్పదనం. ఇందులో ఒకే పని ద్వారా ఒకటి రెండు లాభాలు కాదు వేలాది ప్రయోజనాలు ఒనగూడుతాయి. నమాజు ఒంటరిగా చేయడంలోగల ప్రయోజనాలు తక్కువకావు. అయితే దాంతోపాటు జమాఅత్ షరతుపెట్టి, ఇమామత్ విధానాన్ని నిర్ణయించి, జుమా, ఈద్ పండుగలకు

సంబంధించిన గొప్ప గొప్ప సమావేశాలను ఏర్పరిచి ఆ నమాజు ప్రయోజనాలను లెక్కింపలేనంతగా పెంచడం జరిగింది. రోజాను ఒక్కొక్కరు వేరువేరుగా పాటించడం కూడా శిక్షణకు ఓ గొప్ప మార్గమే. అయితే ముస్లిములందరికోసం రమజాను మాసాన్ని ఖరారు చేసి దాని లాభాలను లెక్కించలేనంతగా చేయడం జరిగింది. అదేవిధంగా జకాత్ దానాన్ని వేరువేరుగా చెల్లించడంలోను అనేక లాభాలున్నాయి. కాని దాని కోసం ఓ బైతుల్‌మాల్ (ధనాగారం) వ్యవస్థను ఏర్పరిచి దాని ప్రయోజనాల్ని ఎలా పెంచడం జరిగిందో ఇస్లామీయ ప్రభుత్వం ఏర్పడితే తప్ప మనకు అర్థం కాదు. ముస్లిములంతా తమ జకాత్ ధనాన్ని ఓ చోట చేర్చి, ఓ వ్యవస్థ ద్వారా దానికి అర్హులైన వారికి పంచడం ఎంత శుభదాయకమో, హజ్ విధి కూడా అలాంటిదే. ఒక్కొక్కరు వ్యక్తిగతంగా హజ్ చేసినా మనిషి జీవితంలో ఓ గొప్ప విప్లవమే వస్తుంది. కాని ప్రపంచ ముస్లిమ్‌లందరికోసం ఒకే సమయంలో హజ్ చేసే విధానాన్ని నిర్ణయించడం వల్ల దాని ప్రయోజనాలకు అంతే లేదు. దీనికి మరింత వివరం కావాలి కాబట్టి ఇన్షా అల్లాహ్ వచ్చే ప్రసంగంలో విపులంగా వివరిస్తాను.

## హజ్ - విశ్వజనీన సదస్సు

ముస్లిమ్ సోదరులారా! హజ్ ఫర్జ్ అయిన ముస్లిములు, అంటే కాబా గృహం వరకు వెళ్ళగలిగే స్తోమతగల వారు ఒకరో ఇద్దరో కారు అన్నది మీకు తెలిసిన విషయమే. ప్రతి పట్టణంలో చాలామంది, ప్రతిదేశంలో లక్షలాదిమందే ఉంటారు. ప్రతి యేడు వాళ్ళల్లో చాలామంది హజ్ సంకల్పంతో బయలుదేరుతారు. ఇక ప్రపంచ నలుమూలల ముస్లిములు నివసించేచోట, హజ్ కాలం రాగానే ఆయా ప్రదేశాల్లో ఇస్లామీయ జీవనం మేల్కొంటుంది. వారిలో ఒక కదలిక మొదలౌతుంది. రమజాన్ మాసంనుండి దాదాపు 'జీఖాదా' మాసం వరకు

అటు జిల్‌హజ్ మాసాంతం నుండి ప్రారంభం అయిన తిరుగు ప్రయాణ సన్నాహాలు 'రబీవుల్ అవ్వల్' ఇంకా చెప్పాలంటే 'రబీవుస్సాని' మాసం వరకు కొనసాగుతుంది. ఈ ఆరేడు మాసాల కాలం వరకు ఓ విధంగా ప్రపంచంలోని ముస్లిమ్ జనవాసాల్లో నిరంతరాయంగా ఓ రకమైన ధార్మిక చలనం కొనసాగుతూనే ఉంటుంది. హజ్‌కు వెళ్ళేవారిలోను, తిరిగివచ్చేవారిలోను ధార్మికత నెలకొని ఉంటుంది. హాజీలను సాగనంపడం, హజ్‌చేసి వచ్చేవారిని ఆహ్వానించడం, హాజీలు చెప్పే హజ్ వివరాలను వినడం ద్వారా కొద్దో గొప్పో ఈ ధార్మికత హజ్‌కు వెళ్ళలేకపోయిన వారిలోను అంకురిస్తుంది.

ఓ 'హాజీ' హజ్ సంకల్పం చేసుకోగానే, ఆ సంకల్పానికి తోడు అతనిలో దైవభీతి, దైవచింతన, పశ్చాత్తాపం, తన తప్పుల్ని మన్నింపజేసుకోవాలన్న కాంక్ష, నైతికత నెలకొంటాయి. అతడు తన బంధుమిత్రుల్తో, తనతో సంబంధం ఉన్న ఇతరుల్తో విడిపోయేటప్పుడు, తను మునుపటివాడు కాదని, దైవచింతనలో పడిపోయాడు కాబట్టి అతని హృదయం ప్రక్షాళింపబడుతున్నట్లుగా ప్రవర్తిస్తాడు. ఆ ప్రవర్తన ఎందరిపై ప్రభావం చూపుతుందో ఆలోచించండి. ప్రతి సంవత్సరం ప్రపంచంలోని పలు ప్రాంతాలనుండి సగటున ఓ లక్షమంది ఇలా హజ్ కోసం సంసిద్ధమైతే వారందరి ప్రభావం ఎన్ని లక్షల మందిని నైతికంగా మార్చగలుగుతుందో గమనించండి. ఇదేకాకుండా హాజీల బృందాలు ఏయే ప్రదేశాలనుండైతే ప్రయాణం చేస్తాయో ఆ ప్రదేశాల్లో నివసించేవారు వారిని చూసి, కలుసుకొని వారి లబ్బైక్, లబ్బైక్ అనే నినాదాల్ని విని ఎందరు ఉత్తేజితులౌతారో! ఎందరి దృష్టి దైవం వైపునకు, దైవగృహం వైపునకు మరలుతుందో! ఇంకా ఎందరిలో నిద్రపోయిన ఆత్మ మేల్కొని హజ్ చేసే ఆకాంక్ష జాగృతమవుతుందో ఆలోచించండి. ఆ తరువాత ఈ హాజీలు తమ కేంద్రంనుండి తమ తమ స్వస్థలాలకు హజ్ వివరాల్తో తిరిగి వస్తూవుంటే, వారిని దర్శించడానికి వచ్చి, అల్లాహ్ గృహ విశేషాలను, ఆ హజ్ సమాచారాన్ని వారినోట విని ఎందరి ధార్మిక భావోద్రేకం మేల్కొంటుందో!!

దైవభీతిని సృష్టించే కాలమో, అలాగే హజ్ కాలం కూడా ప్రపంచమంతటా ఇస్లామ్‌ను పునరుజ్జీవింపజేసే కాలం అన్నది నా అభిప్రాయం. ఇలా, షరీఅత్ నిర్మాత అయిన ఆ దైవం నెలకొల్పిన సాటిలేని వ్యవస్థ, సార్వజనీన ఇస్లామీయ ఉద్యమం. అది ఇన్షాఅల్లాహ్ ప్రళయంవరకు చెరిగిపోకుండా సాగగలదు. ప్రపంచ పరిస్థితులు ఎంత దిగజారినా, కాలం ఎంతగామారి చెడిపోయినా సరే, మనిషి శరీరంలో గుండెను ఎలా అమర్చడం జరిగిందో అలాగే ఇస్లామీయ జగత్తులో ఈ కాబా కేంద్రాన్ని పెట్టడం జరిగింది. గుండె స్పందిస్తూ ఉన్నంతసేపు మనిషి వ్యాధులవల్ల ఎంత కదలలేని స్థితిలో ఉన్నా చనిపోవడం మాత్రం జరగదు. అచ్చం ఇలాగే ప్రపంచపు ఈ గుండె కూడా ప్రతి సంవత్సరం ఎంతో దూరంనుండైనా రక్తనాళాల ద్వారా రక్తాన్ని లాగి ఆ తరువాత తిరిగి శుద్ధమైన ఆ రక్తాన్ని ప్రతి రక్తనాళంలోనికి పంప్ చేస్తుంది. కాబా అనే ఈ గుండె కొట్టు కున్నంతవరకు ఇస్లామీయ రక్త ప్రసరణ జరుగుతూనే ఉంటుంది. అప్పటి వరకు ఇస్లామీయ జగత్తును ఎన్ని వ్యాధులు కృశింపచేసినాసరే, ప్రాణం పోవడం అసంభవం.

కొంచెంసేపు కళ్ళు మూసుకొని ఊహాపథంలో ఆ చిత్రాన్ని దర్శించండి. ఇటు తూర్పునుండి, అటు ఉత్తరం నుండి ఇటు పడమరనుండి అటు దక్షిణం నుండి అనేక జాతులు అసంఖ్యాకమైన దేశాలకు సంబంధించిన ప్రజా సమూహాలు వేలాది మార్గాల ద్వారా ఈ ఏకైక కేంద్రం వైపునకు తరలి వస్తున్నారు. వారి రూపాల్లో, వారి ముఖకవళికల్లో ఎన్నో భేదాలున్నాయి. వాళ్ళ శరీర రంగులువేరు, భాషలుకూడా వేరు. వస్త్రధారణలోను ఎంతో తేడా ఉంది. ఆ కేంద్రానికి దాపుగా ఓ ప్రత్యేకమైన హద్దు దగ్గరకు చేరగానే అంతా తమ తమ జాతీయ దుస్తుల్ని తీసేస్తారు. అంతా ఒకే రకమైన సాదా యూనిఫాం ధరిస్తారు. 'ఇహ్రామ్' అనే ఈ యూనిఫామ్‌ను ధరించాక, వీరంతా విశ్వప్రభువు ఈ భూమ్యాకాశాల స్వామికి సంబంధించిన ఓ సైన్యంలా అగుబడతారు. ఈ సైనిక పటాలం ప్రపంచ వేలాది

సైన్యమది. ఒకే దాస్యపు గుర్తు వారందరిపైనా గోచరిస్తుంది. వారంతా ఒకే విశ్వాస బంధంలో బంధించబడ్డారు. ఒకే రాజధానివైపు తమ చక్రవర్తి సన్నిధిలో హాజరవడానికి వెళుతున్నారు. ఈ యూనిఫాం ధరించిన సైనికులు 'మీకాత్' అనే పరిధి దాటగానే వారి నోట వినబడే నినాదం "లబ్బైక్, అల్లాహుమ్మ లబ్బైక్, లాషరీక లక లబ్బైక్" అన్నదే. మాట్లాడే భాషలు వేరైనా నినాదం మాత్రం అందరిదీ ఒక్కటే. కేంద్రం దాపౌతున్నకొద్దీ వాళ్ళ విశాల పరిధికూడా తగ్గి దగ్గరౌతుంది. వివిధ దేశాల బృందాలు ఒకదానితో మరొకటి కలుసుకుంటాయి. అందరూ ఒకేవిధంగా కలిసి నమాజు చేస్తారు. అందరిదీ ఒకే యూనిఫాం, అందరికీ ఒక్కడే ఇమామ్. అందరి కదలికా ఒక్కటే. అందరి భాష కూడా ఒక్కటే. అంతా అల్లాహు అక్బర్ అనే ఒకే సంజ్ఞపై లేస్తారు, నిలబడతారు, కూర్చుంటారు, రుకూచేస్తారు, సజ్దా చేస్తారు. అంతా ఒకే అరబీ ఖుర్ఆన్‌ను పఠిస్తారు, వింటారు. ఇలా భాష, జాతి, ప్రాంతం, దేశం, వర్గం అనే విభేదాలు సమసిపోయి ఒకే ఒక ఏకేశ్వరోపాసకుల ఓ విశ్వజనీనమైన సముదాయం ఏర్పడుతుంది. ఇక బృందాలన్నీ కలిసి ప్రతి మెట్టప్రదేశాన్ని ఎక్కేటప్పుడు, ప్రతి పల్లంలో దిగేటప్పుడు ఒక బృందం మరో బృందంతో కలుస్తూ, ఒకే ఒక లబ్బైక్, లబ్బైక్ అనే నినాదాలు వాతావరణంలో మార్మ్రోగుతూ ఉంటాయి. అలాగే నమాజుల సమయాల్లో ప్రాతఃసంధ్యలో ఈ నినాదాలే విన్పిస్తూ ఉంటే ఓ అనిర్వచనీయమైన వాతావరణం నెలకొంటుంది. ఈ నినాదఘోషలో మైమరిచి మనిషి లబ్బైక్, లబ్బైక్ నినాదంలో విలీనం అయిపోతాడు. కాబా గృహం చేరాక, ప్రపంచ నలుమూలలనుండి వచ్చి చేరిన జనసందోహం ఒకే వస్త్రధారణలో ఒకే కేంద్రం చుట్టూ ప్రదక్షిణ (తవాఫ్) చేయడం, అంతా కలసి 'సఫా' 'మర్వా' కొండలనడుమ వేగంగా నడవడం, అందరూ కలిసి 'మినా' అనే ప్రదేశంలో విడిది చేయడం, అంతా 'అరఫాత్' మైదానం వైపు బయలుదేరడం అక్కడ ఒకే ఇమామ్ చేసే ప్రసంగాన్ని (ఖుత్బా) వినడం, తిరిగి అంతా కలిసికట్టుగా 'జుమ్రయె ఉక్బా'పై గులకరాళ్ళు విసరడం, అందరూ ఖుర్బానీ చేయడం, పిదప

కలిసి కాబాను ఎదురుగా ఉంచి వృత్తాకారంలో నిలబడి నమాజు చేయడం అన్నది ప్రపంచంలో మరెక్కడా కనబడని దృశ్యం.

ప్రపంచంలోని సమస్త జాతులనుండి వచ్చిచేరిన ప్రజలు ఒకే కేంద్రంలో ఒకే ధ్యేయం కోసం పరిశుద్ధ భావాల్తో, శుద్ధ ఆచరణల్తో వచ్చి చేరడం అన్నది యదార్థంగా ఓ గొప్పవరమే. ఇది ఆదం సంతతికి ఇస్లామ్ ధర్మం తప్ప మరే ధర్మం సమకూర్చిపెట్టలేదు. ప్రపంచ జాతులు ఒకదానితో మరొకటి కలుసుకుంటూనే ఉంటాయి. కాని ఏ విధంగా కలుసుకుంటాయి? యుద్ధమైదానాల్లో గొంతులు కోయడానికి లేక సంధికాన్ఫరెన్సుల్లో దేశాలను జాతులను పరస్పరం ఒక దానినుండి మరొకదాన్ని విడదీయడానికి; లేదా ఐక్యరాజ్య సమితిలో ఓ జాతి మరో జాతిని మోసగించడానికి, కుట్రలు పన్నడానికి, అన్యాయ అక్రమాల వలలను విసిరి ఇతరులకు నష్టం వాటిల్లచేసి తాము ప్రయోజనం పొందడానికి.

సమస్తజాతుల సాధారణ ప్రజలు చిత్తశుద్ధితో పరస్పరం కలవడం, ఉన్నతమైన నైతికతలు, పరిశుద్ధమైన భావాల్తో ఒకరిని ఒకరు పలుకరించుకోవడం, పరస్పరం ప్రేమానురాగాల్తో మెలగడం, హృదయపూర్వకమైన, ఆధ్యాత్మికమైన సమైక్యతతో కలవడం, వారిభావాలు, ఆచరణలు, ధ్యేయాల సమైక్యతతో కలవడం; ఒకసారి కలిసి విడిపోవడమేకాదు ఎల్లప్పుడు ప్రతి సంవత్సరం ఒకే ఒక కేంద్రంలో ఇలా సమావేశం అవడం అనే వరం ఇస్లామ్‌లో తప్ప మానవకోటికి మరెక్కడైనా లభ్యం కాగలదా? ప్రపంచంలో శాంతిని నెలకొల్పడానికి, జాతిక జాతికి నడుమ ఉండే వైరాన్ని తొలిగించడానికి, కక్షలు కార్పణ్యాలు, కల్లోలాలను రూపుమాపి, ప్రేమానురాగం, సౌభ్రాతృత్వాల వాతావరణాన్ని నెలకొల్పడానికి ఇంతకంటే మేలైన మార్గాన్ని ఎవరు సూచించగలరు?

ఇస్లామ్ కేవలం ఇంతమట్టుకే కాదు. ఇక్కడ ఇంతకంటే మరెంతో ఉంది.

హజ్ ఉమ్రాల కోసం ప్రత్యేకించబడ్డ ఆ నాలుగు నెలల్లో, కాబా వైపునకు వచ్చే మార్గాలన్నిటిలోను శాంతి స్థాపించే యత్నం చేయాలని ఆదేశించింది ఈ

ధర్మం. ఇది ప్రపంచంలో శాంతిని నెలకొల్పడానికి ఓ శాశ్వతమైన ఉద్యమం. ఈ ప్రపంచపు అధికార పగ్గాలు ఇస్లామ్ చేతిలోనే ఉండి ఉంటే కనీసం సంవత్సరంలోని మూడింట ఒక వంతుకాలం శాశ్వతంగా యుద్ధమూ, వినాశనానికి అతీతంగా ఉంటుంది.

ఇది ప్రళయకాలం వరకు శాంతినిలయంగా విలసిల్లే హరం (కాబాగృహం) గల నగరాన్ని ప్రసాదించింది. ఇందులో మనిషేకాదు కనీసం జంతువునైనా వేటాడ్డానికి వేల్లేదు. ఈ హరం పరిధిలోని గడ్డిని సైతం కోసే అనుమతి లేదు. ఆ భూభాగపు ఓ ముల్లునైనా విరచడానికి వీల్లేదు. ఎవరి వస్తువైనా పడిపోతే దాన్ని ముట్టుకోరాదనే ఆదేశం ఉంది.

ఇస్లామ్ ప్రపంచ ప్రజలకు ఒసగిన ఈ నగరంలో ఆయుధాలను వెంటబెట్టుకొని పోవడానికి వీల్లేదు. ఇక్కడ ధాన్యాన్నిగాని, ఇతర నిత్యావసర వస్తువులనుగాని నిల్వచేసి వాటిపై ధరలను పెంచడం దైవ తిరస్కారం అంతటి ఘోరపాపం. ఈ నగరంలో అత్యాచారం చేసినవారిని ఉద్దేశిస్తూ "మేము అతనికి యాతనలతో కూడిన శిక్ష విధిస్తాం" అని హెచ్చరించాడు అల్లాహ్.

దైవాన్ని ప్రభువుగాను, ఆయన ప్రవక్త ముహమ్మద్ (సఅసం)ను మార్గదర్శకునిగాను స్వీకరించి ఇస్లామ్‌లో చేరే వ్యక్తులందరి హక్కులు ఈ నగరంలో సమానం. ఆ వ్యక్తి ప్రపంచం ఏ మూలలో ఉండేవాడైనాసరే. అతడు చైనావాడుకాని, ఆఫ్రికావాడుగాని, ఆసియా ఖండానికి చెందినవాడుగాని ఇంకే ఇతర ఐరోపా అమెరికా ఖండాలకు చెందినవాడైన సరే అతడు ముస్లిమ్ అయిపోతే, మక్కావాసులకు ఏ హక్కులైతే ఉంటాయో అతనికి కూడా ఆ హక్కులే వర్తిస్తాయి. పూర్తిహరం ప్రాంతం ఓ మస్జిద్ ప్రాంతం లాంటిది. ఎవరైనా మస్జిద్‌లోనికి వెళ్ళి ఎక్కడైనా కూర్చుంటే అది అతని ప్రదేశమే అవుతుంది. ఎవరూ అతణ్ణి అక్కణ్ణుంచి లేపలేరు. అతణ్ణుంచి అద్దె వసూలూ చేయలేరు. అయితే అతడు తన జీవితాంతం ఆ ప్రదేశంలో కూర్చుని, ఆ ప్రదేశం నాది అనే హక్కు అతనికి లేదు. అతడు దాన్ని అమ్మనూలేడు అద్దె వసూలు చేయనూలేడు. ఆ వ్యక్తి

అక్కడినుండి వెళ్ళిపోతే ఇతరులు కూడా అక్కడ కూర్చోడానికి హక్కుదారులే. ఇదే పరిస్థితి పూర్తి మక్కా ప్రాంతానికి వర్తిస్తుంది.

దైవప్రవక్త (సఅసం) గారి ప్రవచనంలో "ఏ వ్యక్తి అయితే ఈ నగరంలో ప్రథమంగా వచ్చి విడిదిచేస్తాడో ఆ ప్రదేశం అతనిదే అవుతుంది" అని ఉంది.

అక్కడ ఇళ్ళకు అద్దె వసూలుచేయడం ధర్మసమ్మతం కాదు. హజ్రత్ ఉమర్ (రజిఅన్) అక్కడి ప్రజలను ఉద్దేశించి ఇలా అన్నారు: "మీ ఇంటి ఆవరణల తలుపులు మూయకండి. ఎవరైనా వచ్చి మీ ఆవరణల్లో బసచేయదలిస్తే దానికి వీలు కల్పించండి" అని ఆదేశించారు. కొందరు ధర్మవేత్తలైతే, మక్కా నగరంలోని గృహాలపై ఎవరికీ యాజమాన్య హక్కులేదు, అవి ఎవరి వారసత్వంలోనికీ పోవు అని అంటారు.

ఇస్లామ్‌లో తప్ప ఈ శుభాలు, ఈ వరాలు ఇంకెక్కడైనా లభ్యం కాగలవా? ఆలోచించండి.

సోదరులారా! ఇదండీ ఆ హజ్ అంటే. దీన్ని గురించి, ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయని చెప్పడం జరిగింది. దాని ప్రయోజనాలన్నిటిని లెక్కించి చెప్పాలంటే నా శక్తి చాలదు. అయితే మీ ముందుంచిన కొన్ని ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని హజ్ అంటే ఏమిటో మీరు ఇట్టే గ్రహించగలరనుకుంటాను.

అయితే ఇదంతా విన్నాక, నా ఆవేదనాభరితమైన మనస్సులోని కొన్ని మాటలను కూడా ఆలకించండి. పుట్టుకతోనే ముస్లిములుగా ఉన్న మీ పరిస్థితి అచ్చం వజ్రాలగనిలో పుట్టిపెరిగిన పిల్లవానిలాంటిది. ఈ కుర్రవాడు తన చుట్టూరా వజ్రాల్ని చూస్తాడు. ఆ వజ్రాల్తోనే రాళ్ళుగా భావించి ఆడుకుంటాడు. అందుకనే ఈ వజ్రాలు అతని దృష్టిని ఆకర్షించవు. వాటి విలువ ఏమిటో అతనికి తెలియదు. ఇదే పరిస్థితి మీదీను. ప్రపంచం ఏ వరాలకైతే పరితపిస్తోందో, అవి కరువైనందున ఎన్ని కష్టాలకు కడగండ్లకు గురౌతుందో, ఆ వరాలు మీకు ఊరికనే ఎలాంటి ప్రయత్నం లేకుండానే దొరికాయి. అదృష్టవశాత్తు మీరు ముస్లిమ్‌ల

ఇంట పుట్టారు. జీవితంలోని చిక్కుల్ని విడదీసి, ఓ సక్రమమైన మార్గాన్ని చూయించే కల్పతరువు అయిన 'కలిమయే తౌహీద్' (ఏకేశ్వరవాద వచనం) బాల్యంనుండి మీ చెవుల్లో పడుతూనే ఉంది. పశుత్వం నుండి మానవత్వం వైపునకు మరల్చే ఆ 'నమాజ్' 'రోజాలు' అనే దివ్యౌషధాలు మీరు కళ్ళు తెరవగానే తామంతటవే తాతతండ్రుల నుండి వారసత్వంగా మీకు లభించాయి. మానవులకు దైవభీతిని నేర్పి, పరస్పరం సోదరులుగా మిత్రులుగా తీర్చిదిద్దడానికి ఇంతకంటే మరో దివ్యౌషధం మరొకటి వుంది అని నేటికీ కనుగొనడం జరుగలేదు. మనస్సుల్లోని కాఠిన్యం దూరం కాకపోవడమే కాక, ప్రపంచ ఆర్థిక వ్యవస్థ సైతం చక్కబడే జకాత్ వ్యవస్థ ఓ వైద్యుని పిల్లవానికి ఎలాంటి ప్రయత్నం లేకుండానే లభించిన దివ్య మెడిసిన్ ఫార్ములాలా మీకు లభించింది. అది దొరక్కపోవడం చేత ప్రపంచ ప్రజలు ఒకరినొకరు ఎలా దోచుకుంటున్నారో మీరు చూస్తూనే వున్నారు. ఈ ఫార్ములా కోసం అనేకులు ఎంతో ప్రయత్నం చేస్తున్నారు.

ఇదేవిధంగా ఒక ఉద్యమాన్ని ప్రపంచమంతటా వ్యాపింపజేయటానికి, అనంతకాలాలకు దాన్ని సజీవంగా ఉంచడానికి హజ్‌కన్నా బలవత్తరమైన విధానం నేటి వరకూ మనిషి కనుగొనలేకపోయాడు. మానవ జాతిని భూలోకంలోని ప్రతి భాగంనుండి తన వైపునకు ఆకర్షించుకొని ఏకేశ్వరుడైన అల్లాహ్ పేర ఒకే ఒక కేంద్రంలో సమావేశపరచి, అసంఖ్యాకమైన జాతుల్ని, తెగల్ని ఏకేశ్వరోపాసకులుగా, చిత్తశుద్ధిగల మనుషులుగా శాంతి సౌభ్రాతృత్వంగల వారుగా తీర్చిదిద్దే విశ్వజనీనమైన వ్యవస్థ హజ్ తప్ప మరేదీ లేదు. అయితే మీరే ఈ వరాలకు విలువ నివ్వడం లేదు. ఎందుకంటే కళ్ళు తెరువగానే ఇవి మీకు మీ ఇంటనే దర్శనమిచ్చాయిగనుక. ఇప్పుడు మీరు వాటితో అచ్చం, వజ్రాలగనిలో పుట్టిపెరిగిన ఆ అమాయక పిల్లవాడు వజ్రాల్తో ఆడుకుంటున్నట్లుగా ఆడుకుంటున్నారు. మీరు మీ అజ్ఞానం, అమాయకత్వం వల్ల ఈ బలమైన శక్తిని వృధాచేస్తున్న తీరు చూస్తుంటే హృదయం మండుతోంది. రాళ్ళు పగలగొట్టే చేతులు రతనాలను పిండి పిండి చేయడం చూసి ఓర్చుకునే శక్తి ఎవరికుంటుంది?

సోదరులారా! మీరు ఓ కవి రాసిన కవితను వినే ఉంటారు. దాని సారాంశం ఏమిటంటే,

"ఈసా (అ.స) (ఏసుక్రీస్తు) లాంటి దైవప్రవక్తగారి కంచరగాడిదే అయినా అది మక్కాను దర్శించడం వల్ల ఎలాంటి ప్రయోజనం పొందలేదు. అది అక్కడికి వెళ్ళొచ్చినా మునుపటి గాడిదలానే మిగిలిపోతుంది."

నమాజ్, రోజా, హజ్, ఏదైనా గానివ్వండి ఇవన్నీ వివేకవంతుల శిక్షణార్థమే. జంతువులను మచ్చికచేయడానికి కావు. వీటి భావాన్ని అర్థం చేసుకోనివారు, ఉద్దేశాన్ని గ్రహించనివారు, వాటివల్ల ఒనగూడే ప్రయోజనాలను పొందగోరనివారు ఈ ఆరాధనల ధ్యేయాన్ని గూర్చి ఒక్కసారైనా మననం చేసుకోనివారు ఒకవేళ ఈ ఆరాధనల్ని కేవలం అనుకరించినట్లైతే ఎలాంటి ఫలితాన్నీ ఆశించలేము. ఒకరినిచూసి దురదృష్టవశాత్తు నేటి ముస్లిములు సాధారణంగా ఈ విధానాన్నే ఈ పోకడనే అనుసరిస్తున్నారు. ప్రతి ఆరాధనకు సంబంధించిన రూపం ఎలా ఉందో అలానే దాన్ని చేసి చూయిస్తున్నారు. అయితే ఆ రూపం ఓ ఆత్మరహితమైన రూపం. ప్రతి సంవత్సరం వేలాదిమంది యాత్రికులు ఇస్లామీయ కేంద్రం వైపునకు వెళ్ళి హజ్ చేయడం, తిరిగి రావడం మీరు చూస్తూనే ఉన్నారు గదా. అయితే వెళ్ళేటప్పుడుగాని, తిరిగి వచ్చేటప్పుడుగాని, ఓ కాబా యాత్రికునికి ఉండవలసిన అసలు దైవభీతి, హజ్ ప్రభావం వారిలో కానరావు. ఇదేవిధంగా యాత్రలో వారు ప్రయాణించే ప్రతి ఊరు, ప్రతి పట్టణంలోని ముస్లిమ్, ముస్లిమేతరులపై వారివల్ల ఎలాంటి నైతికతా ప్రభావం పడదు. దీనికి భిన్నంగా తమ చేతల ద్వారా వారి వాచాలత్వాన్ని, అనైతికతలను, వారిలోని చెడులను ప్రదర్శిస్తూ ఉంటారు. వారి నడవడికలను చూసిన ముస్లిమేతర సోదరులు ఇస్లామ్ గొప్పదనానికి ప్రభావితులవడం అలావుంచి, స్వయంగా ముస్లిముల దృష్టిలోనే దానికి విలువలేకుండా పోయింది. అందుకే నేడు మన జాతి నవయువకులే, ఈ హజ్ ప్రయోజనం ఏమిటో కాస్త వివరించండి అని

అడుగుతున్నారు. యదార్థం ఏమిటంటే ఈ హజ్‌ను దాని అసలు రూపంలో ఆచరిస్తే, దైవతిరస్కారులు సైతం దాని ప్రయోజనాల్ని చూసి విశ్వసించగలిగేవారు. ఓ ఉద్యమానికి సంబంధించిన కార్యకర్తలు వేలాది, లక్షలాది మంది, ప్రతి ఏడు ప్రపంచం నలుమూలలనుండి ఓ చోట చేరుతున్నారు. అక్కణ్ణుండి తమ తమ దేశాలకు తిరిగి వెళుతున్నారు. ప్రతి దేశం, ప్రతి పట్టణంనుండి పయనిస్తూ తమ పవిత్ర జీవనాన్ని, పవిత్ర నైతికతను ప్రదర్శిస్తూ వెళుతున్నారు. ఆగిన చోటల్లా, వెళ్ళే ప్రదేశాలన్నిటిలోను తమ ఉద్యమ సూత్రాలను, సిద్ధాంతాల్ని నోటితో ప్రచారం చేయడమేకాక తమ నిజ జీవితంలో తమ చేతల ద్వారా పూర్తిగా ఆచరిస్తూ పోతు న్నారు. ఇలా ఒక సంవత్సరం కాదు, పది ఇరవై సంవత్సరాలు కాదు శతాబ్దాల తరబడి ఈ వరవడి నడుస్తూ ఉంటే, నేడు "దీని ప్రయోజనాలేమిటి?" అని అడిగే అవసరం కలిగేదా? దైవసాక్షి! ఈ పనే సక్రమంగా జరిగివుంటే గ్రుడ్డివాళ్ళు దీని ప్రయోజనాల్ని గాంచేవారు. చెవిటివాళ్ళు దీని లాభాలేమిటో ఆలకించగలిగేవారు. ప్రతి సంవత్సరపు 'హజ్' కోట్లాది ముస్లిములను సద్వర్తనులుగా చేసేది. వేలాది ముస్లిమేతరులను ఇస్లామ్ వైపునకు ఆకర్షితులుగా చేసేది. లక్షలాది ముస్లిమేతరుల హృదయాలపై ఇస్లామ్ ఔన్నత్యపు ముద్రపడేది. కాని ఈ అజ్ఞానం వల్ల ఎంతటి విలువైన వస్తువు నాశనమై పోతుందో!

హజ్ ప్రయోజనాలన్నీ ఒనగూడాలంటే ఇస్లామీయ కేంద్రంలో, ఈ సార్వత్రిక శక్తిని ఉపయోగించి సరైన మార్గంలో నడపగలిగే ఓ దృఢమైన శక్తి అవసరం. ప్రతి సంవత్సరం ప్రపంచం అనే శరీరంలో శుద్ధరక్తాన్ని ప్రసరింపజేసే ఓ గుండె కావాలి. ఈ వేలాది, లక్షలాది దైవదత్తమైన వార్తాహరులద్వారా ప్రపంచం నలుమూలల ఇస్లామీయ బోధనల్ని వ్యాపింప జేయగలిగే ఓ మేధ కావాలి. ఇదంతా కాకపోయినా కనీసం అక్కడ స్వచ్ఛమైన ఇస్లామీయ జీవన వ్యవస్థకు సంబంధించిన పరిపూర్ణమైన ఓ ఆదర్శం కనబడాలి. ప్రతి సంవత్సరం ప్రపంచ ముస్లిములు ఆ ఆదర్శాన్నిచూసి నిజమైన ధార్మికత ఏమిటో నేర్చుకొని మరిలేవారు, అయితే విచారించవలసిన విషయం ఏమిటంటే అక్కడ ప్రతిదీ కరువైపోయింది. ఓ సుదీర్ఘకాలంనుంచి అరేబియాలో అజ్ఞానం పెరుగుతోంది. 'అబ్బాసీ'ల పరిపాలనా

కాలం మొదలు ఉస్మానీయుల హయాం వరకు, ప్రతి కాలంలోను రాజులు తమ రాజకీయ ప్రయోజనాల కోసం అరేబియాను ప్రగతి వైపునకు తీసుకొని పోయేబదులు, శతాబ్దాల తరబడి దాన్ని పతనానికే గురి చేస్తూ వచ్చారు. వారు అరేబియా ప్రజలను విజ్ఞానం, నైతికత, నాగరికతల్లో, ఒకటేమిటి ప్రతి విషయంలోను పతనం వైపునకే నెట్టే ప్రయత్నం చేశారు. ఫలితంగా ఒకప్పుడు ఇస్లామీయ కాంతిని ప్రపంచం అంతటా వెదజల్లిన భూభాగం, నేడు ఇస్లామ్‌కు పూర్వంలా ఆ అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతోంది. ఇప్పుడిక్కడ ఇస్లామీయ విజ్ఞానంగాని, ఇస్లామీయ నైతికతలుగాని, ఇస్లామీయ జీవన విధానంగాని కానరావు. ప్రజలు దూరదేశాలనుండి ఎంతో భక్తిశ్రద్ధల్తో కాబా గృహ సందర్శనార్థం పయనించివస్తారు. తీరా ఇక్కడకు చేరిన తరువాత, తమ చుట్టూ అజ్ఞానం, దురాశ, అశ్లీలం, లౌకికవాదం, అనైతికత, అస్థవ్యస్థ కార్యకలాపాలు, సాధారణ ప్రజలు అన్ని రకాల అధోగతికి చేరుకోవడం చూసి వారి ఆశలన్నీ నిరాశలై పోతాయి. చివరికి, చాలామంది హజ్ ఆచరించిన తరువాత తమ విశ్వాసానికి బలం చేకూర్చేబదులు, దానిని పోగొట్టుకునే వెళతారు. దైవప్రవక్తలు హజ్రత్ ఇబ్రాహీమ్ (అ.స), హజ్రత్ ఇస్మాయీల్ (అ.స)ల తరువాత అజ్ఞాన కాలంలో కాబాగృహంపై పెత్తనం చెలాయించిన పూర్వకాలపు పౌరోహిత్యాన్ని దైవప్రవక్త (సఅసం) వచ్చి నామరూపాల్లేకుండా చేశారు. అది తిరిగి ఊపిరి పీల్చుకుంటోంది. కాబా గృహం బాగోగుల్ని చూసేవారు నేడు పూజారులై కూర్చు న్నారు. దైవగృహం వారి స్వంత ఆస్తి, హజ్ వారికి వ్యాపారంగా పరిణమించాయి. హజ్ చేసే వాళ్ళను తమ కస్టమర్లుగా భావించడం జరుగుతోంది. వివిధ దేశాల్లో, పెద్ద పెద్ద జీతాలిచ్చి కస్టమర్లను పంపడానికి ఏజెంట్లను నియమిస్తున్నారు. ప్రతి సంవత్సరం అజ్మీర్ సేవకుల్లా ఏజెంట్ల ఒక పటాలమే మక్కానుండి బయలుదేరి ప్రపంచం నలుమూలల్లో వ్యాపిస్తోంది. ఖుర్‌ఆన్ ఆయత్‌లను, హదీసు బోధనల్ని వారికి వినిపించి హజ్ కోసం ప్రోత్సహించేది దైవం విధించిన ఫర్జును గుర్తుచేయడానికి కాదు, కేవలం ఆదేశాల్ని విని ప్రజలు ఎక్కువ సంఖ్యలో హజ్‌కు బయలుదేరాలని, వారి ఆదాయం పెరగాలని మాత్రమే. అంటే అల్లాహ్, దైవప్రవక్త ఇదంతా ఏర్పరిచింది ఈ పూజారుల పోషణార్థమే అన్నమాట.

ఇక ఈ ఫర్జును నిర్వహించడానికి మనిషి ఇంటినుండి బయలుదేరి ప్రయాణం అయినప్పటినుండి తిరిగి ఇంటికి చేరేవరకు, ప్రతి చోటా ఇతనికి ధార్మిక కూలీలు, ధార్మిక వ్యాపారులే తటస్థపడుతూ ఉంటారు. ముఅల్లింలు (హజ్ పద్ధతినేర్పేవారు), ముతవ్విఫ్‌లు (తవాఫ్ చేయించేవారు), వకీలె ముతవ్విఫ్ (ప్రదక్షిణ చేయించేవారి ఏజెంట్లు) కాబా గృహపు తాళపుచెవి కలిగి ఉండేవాడు, అరేబియా ప్రభుత్వమూ ఒకరేమిటి రకరకాలవారు ఈ వ్యాపారంలో భాగస్వాములే. హజ్‌లో చేయబడే ఆచారాలు డబ్బు తీసుకునే చేయించడం జరుగుతోంది. ఓ ముస్లిమ్ కోసం కాబా గృహద్వారం ఫీజులేకుండా తెరుచుకోదు, నఊజుబిల్లాహి మిన్‌జాలిక్ (దైవం మన్నించుగాక). పౌరోహిత్యాన్నే తుదముట్టించిన ఈ నిజధర్మంలో పుట్టిన బూటకపు సేవకులు, కేంద్రీయ ఆరాధనాలయ ముజావర్లు బెనారస్, హరిద్వార్ పండితుల్లాంటి పండితుల్లా ప్రవర్తిస్తున్నారు. ఏ ప్రదేశంలోనైతే ఆరాధన చేయించడం కూలిగా, ఓ వ్యాపారంగా మారిపోయిందో, మరెక్కడైతే ఆరాధనా లయాన్ని ఆదాయపు ఒనరుగా మార్చడం జరిగిందో, ఎక్కడైతే మనిషి దైవాదేశాలను నిర్వర్తించడానికి డబ్బు చెల్లించాల్సి ఉంటుందో, ఇంకెక్కడైతే ధార్మిక సదవకాశం ఓ విధంగా వ్యాపారసామగ్రిగా మారిపోయిందో అలాంటిచోట ఇక ఆరాధనా భావం, ఆ ఆధ్యాత్మికత ఎలా నిలువగలదు? ఒకవైపున అధికంగా సంపాదించాలనే, మరోవైపున తక్కువగా ఖర్చుచేయాలనే మనస్తత్వంతో జరుగుతున్నప్పుడు హజ్ చేసేవాళ్ళకు, చేయించేవాళ్ళకు యదార్థమైన ఆధ్మాత్మిక ప్రయోజనాలు లభిస్తాయని మీరెలా ఆశించగలరు.★ నా ఈ ప్రస్తావన ద్వారా ఒకరిని దోషిగా నిలబెట్టడం అనేది నా అభిమతం కాదు. హజ్‌లాంటి మహోన్నత శక్తిని నిర్వీర్యంగా మార్చినది ఏదీ అని చెప్పడమే నా ఉద్దేశ్యం. ఇస్లామ్‌లోను, అది సూచించిన విధానాల్లోను

---

★ *ఈ ప్రసంగం 1938వ సంవత్సరం నాటిది అన్నది గమనార్హం. ఆనాటి నుండి ఈనాటి వరకు పరిస్థితులు చక్కబడ్డాయి. సౌదీ అరేబియా ప్రభుత్వం ఇంకా సంస్కరించాలని ప్రయత్నిస్తోంది. అరేబియాలో విద్యావిజ్ఞానాలు వికసిస్తున్నాయి. రియాద్, మక్కా, జిద్దా లాంటి పట్టణాల్లో షరీఅత్ పీఠాలు నెలకొల్పడం*

లోపం ఉంది అని భావించడం పొరపాటు. లోపమల్లా ఇస్లామ్ ధర్మాన్ని సరిగ్గా అనుసరించనివారిదే. ఏ మార్గాలైతే మిమ్మల్ని మానవతకు ఆదర్శంగా మార్చగలవో వాటిని అవలంబించి ప్రపంచం మొత్తానికే నాయకత్వం వహించగలరు. అవి నేడు సరైన ఫలితాన్ని ఇవ్వక పోవడానికి, వాటి ప్రయోజనాల్లో అనుమానం కలుగడానికి కారణం మీరే. ఇది మీ స్వయంకృతాపరాధమే. ఉదాహరణగా చెప్పాలంటే ఓ గొప్ప వైద్యుడు తన దివ్య ఔషధాలను పొందుపరిచిపోతే అవివేకులు, అజ్ఞానులు అయిన అతని వారసుల చేతుల్లో పడి అవి నిష్ప్రయోజనంగా మారిపోయాయి. ఇంకా చెప్పాలంటే చెడ్డపేరును తెచ్చిపెట్టాయి. ఔషధ ఫార్ములా ఎంత సరైనదైనా, దాన్ని ఉపయోగించే విధానం తెలిసి వుండాలి. అజ్ఞానులు దాన్ని ఉపయోగించబోతే ప్రయోజనం చేకూరడం అటుంచి నష్టాన్నే కలిగిస్తుంది. ఆ ఫార్ములాను గుర్తించే శక్తి సామర్థ్యాలే కరువైపోయినప్పుడు అది తప్పుడు ఫార్ములా అని భావించడం తప్ప మరేం అవుతుంది?

---

*జరిగింది. మదీనా నగరంలో ఇస్లామీయ యూనివర్శిటీ విస్తృతమైన పనిని చేపట్టింది. మక్కా నగరంలో రాబితయే ఇస్లామీ అనే ఓ అంతర్జాతీయ సంస్థను ఏర్పరచడం జరిగింది. ఇది హజ్ సమావేశం ద్వారా ప్రయోజనం పొంది ముస్లిమ్ దేశాలన్నిటిలోను ధార్మిక చైతన్యం రావాలనే ప్రయత్నం చేస్తోంది. ఈ దృష్టికోణంలో పరిస్థితులు చాలా మట్టుకు చక్కబడ్డాయి. ఇక రెండు విషయాల వైపునకు దృష్టి మరల్చవలసి ఉంది. మక్కా, మదీనా పట్టణాలుగల ఈ భూభాగాన్ని పాశ్చాత్య నాగరికత ముంపునుండి రక్షించడం ఒకటైతే, ముఅల్లిమీన్ (హజ్ విధానాన్ని నేర్పేవారు) విధానాన్ని చక్కదిద్దడం రెండోది. సౌదీ అరేబియా ప్రభుత్వం ఈ విషయంలో సరైన నిర్ణయం తీసుకుంటుందని ఆశిద్దాం.*

# జిహాద్

ముస్లిమ్ సోదరులారా, వెనుకటి ప్రసంగాలలో మాటిమాటికీ నేను ఒక విషయాన్ని నొక్కి చెప్పాను. అల్లాహ్ విధించిన ఆరాధనలు, ఈ నమాజ్, రోజా, హజ్, జకాత్ ఇస్లామ్ మూలస్థంభాలుగా పేర్కొనబడ్డాయి. ఇవన్నీ ఇతర మతాలలోని ఆరాధనలలా పూజాపురస్కారాలు, మొక్కుబడులు, యాత్రల్లాంటి ఆచారాలు కావు. వీటిని ఆచరించగానే దైవం మీ పట్ల ప్రసన్నుడవుతాడని అనలేము. నిజానికి ఇవన్నీ మిమ్మల్ని ఒక మహత్తర ఆశయం కొరకు మిమ్మల్ని సమాయత్తపరచడానికి, ఒక పెద్ద పనికి మీ శిక్షణ గరపడానికి విధిగా నియమించబడ్డాయి. నేను ఈ శిక్షణ, సన్నద్ధతల పద్ధతిని గురించి సవివరంగా తెలిపాను. అందువల్ల ఆ ఆశయమేమిటో, ఈ సన్నద్ధత దేనికో తెలిపే సందర్భం ఆసన్నమయింది.

## ఇస్లామ్ అసలు కోరేదేమిటి?

క్లుప్తంగా చెప్పాలంటే ఆ ఆశయం, మానవునిపై నుంచి మానవుని ప్రభుతను నిర్మూలించి ఒకే దేవుని ప్రభుతను స్థాపించడం. ఈ ఆశయం కోసం సకల శక్తులు వినియోగించడం, ప్రాణాలొడ్డి కృషి సలపడమే జిహాద్. నమాజ్, రోజా, హజ్, జకాత్- అన్నీ ఈ ఆశయానికి సమాయత్తపరిచే సాధనాలే. కాని మీరు చాలా కాలంగా ఈ ఆశయాన్ని, ఆ మహత్కార్యాన్ని విస్మరించివేశారు, మీ కోసం సకల ఆరాధనలు కేవలం సూఫీయిజంగా రూపొందాయి. అందువల్ల నేను చెప్పిన ఆ చిన్న వాక్యంలోని భావాన్ని మీరు ఒక నుడికట్టుగా భావించి ఉంటారు. సరే రండి, ఆ ఆశయమేమిటో నేను మీ ముందు సవివరంగా చెబుతాను.

## చెడులకు మూలం

ప్రపంచంలో మీరు చూసే చెడుగులన్నింటికీ మూలం చాలా వరకు ప్రభుతలోని చెడుగు. ప్రభుత్వం చేతుల్లో శక్తీ సంపదలుంటాయి. చట్టం చేసేదీ

ప్రభుత్వమే. పరిపాలనకు సంబంధించిన అధికారాలన్నీ ప్రభుత్వ అధీనంలో ఉంటాయి. పోలీసు, సేనాబలం కూడా ప్రభుత్వం వద్దనే ఉంటాయి. అందువల్ల ప్రజల జీవితాలలో వ్యాపించే ప్రతి చెడుగు ప్రభుత్వం ద్వారానే వ్యాపిస్తుంది. ఏ విషయమయినా విస్తరించాలంటే శక్తి కావాలి. ఆ శక్తి ప్రభుత్వం వద్దనే ఉంటుంది.

ఉదాహరణకు, వ్యభిచారం విచ్చలవిడిగా కొనసాగడం మీరు చూస్తారు. వేశ్యాగృహాలలో ఈ కార్యకలాపం బహిరంగంగా సాగుతోంది. దీనికి కారణం ఏమిటీ? కారణం ఒక్కటే. ప్రభుత్వ అధికారాలున్న వారి దృష్టిలో వ్యభిచారం నేరం కాదు. వారూ ఇందులో పాల్గొంటారు, ఇతరుల్నీ దీన్ని చేసే అవకాశాన్నిస్తారు. వారు దీన్ని ఆపివేయదలిస్తే ఇది ఇంత విచ్చలవిడిగా కొనసాగేది కాదు. వడ్డీ వ్యాపారం బాగా సమృద్ధంగా సాగుతోంది. ధనవంతులు బీదవారి రక్తం పీల్చి లావెక్కుతున్నారు. కారణం? ప్రభుత్వం స్వయంగా వడ్డీ తింటుంది, వడ్డీ తినేవారికి సహాయపడుతుంది. ప్రభుత్వం నిర్వహించే న్యాయవ్యవస్థ వడ్డీ వ్యాపారుల పక్షాన తీర్పులు చెబుతాయి. వాటి సమర్థన వల్లనే పెద్ద పెద్ద షావుకార్లు, బ్యాంకులు నడుస్తున్నాయి.

ప్రజల్లో నిర్లజ్జత, నీతిబాహ్యతలు రోజుకురోజు పెరుగుతూ పోతున్నట్లు మీరు గమనిస్తున్నారు. ఎందువల్ల ఇలా జరుగుతోంది? కేవలం, ప్రభుత్వం ప్రజల విద్యాబుద్ధుల కోసం ఈ విధమయిన ఏర్పాటు మాత్రమే చేయడం వల్ల. నైతికత, మానవతలకు సంబంధించిన ఆదర్శాలు, మీకు కానవస్తున్నవే దానికి ఎంతో ఇష్టమయినవి. మరో విధమయిన విద్యాబుద్ధులు, శిక్షణలు గరిపి మీరు మరో విధమయిన మానవులు తయారు చేయాలని అనుకుంటే సాధనా సంపత్తి ఎక్కణ్ణుంచి తెస్తారు? కొందరిని తయారు చేసినా వారిని ఎక్కడ యోగ్యులుగా సమర్థులుగా నిలబెడతారు? ఉపాధి ద్వారాలు, వారు ఫిట్ అయ్యే రంగాలు సర్వమూ ఈ భ్రష్టుపట్టిన ప్రభుత్వ అధీనంలోనే ఉన్నాయే.

ప్రపంచంలో లెక్కలేనంత రక్తపాతం జరుగుతూ ఉందని మీరు బాధపడతారు. మానవుని జ్ఞానం అతని వినాశానికి ఉపయోగపడుతోంది. మానవుని

కష్టఫలాలు అగ్నికి ఆహుతి అవుతున్నాయి. విలువయిన ప్రాణాలు మట్టిపెంకుల కన్నా హీనంగా, నిర్దయగా, వ్యర్థపరచబడతున్నాయి. ఇదంతా దేనికీ? కేవలం ఒకటే కారణం. ఆదమ్ సంతానంలో అందరికన్నా దుష్టులయినవారు, దుర్నడతగలవారు ప్రపంచ జాతుల మార్గదర్శకులుగా అధికార పాశాలు అధీనంలో ఉన్నవారుగా చెలామణి అవుతున్నారు. శక్తి వారి చేతుల్లో ఉంది. వారు తాము కోరిన దిశలో ప్రపంచాన్ని నడుపుతున్నారు, ప్రపంచం అటే నడుస్తోంది కూడా. జ్ఞానం, ధనం, కష్టం, ప్రాణం ప్రతి వస్తువు వారు నిర్ణయించిన వినియోగంలోనే కొనసాగుతోంది.

మీరు చూస్తూనే ఉన్నారు ప్రపంచంలో ఎల్లెడలా అన్యాయం అత్యాచారాలు జరుగుతున్నాయి. బలహీనుడికి ఎక్కడా న్యాయం జరగటం లేదు. బీదవాడు బ్రతకడం దుర్లభమయిపోయింది. న్యాయస్థానాలు పచారికొట్లయి పోయాయి, అక్కడ డబ్బు పెట్టి కాని న్యాయం కొనలేము. లెక్కలేనంత పన్నులు వసూలు చేయబడుతున్నాయి. అధికారులకు మారాజుల్లాంటి జీతాలివ్వడానికి, వైభవోపేత మయిన కట్టడాలకు, యుద్ధానికి ఆయుధాల కొరకు, ఇంకా ఇలాంటి వ్యర్థ మయిన ఖర్చులకు ఆ డబ్బంతా తగులబెడుతున్నారు. షావుకారులు, జమీందారులు, రాజులు, ధనవంతులు, బిరుదులు పొందినవారు, బిరుదులు ఆశించేవారు, పెద్దలు, పీఠాధిపతులు, గురువులు, సినిమా కంపెనీల యాజమానులు, సారాయి వ్యాపారులు, అశ్లీల సాహిత్యం పత్రికల విక్రయదారులు, జూదపు వ్యాపారులు తదితరులు చాలా మంది ప్రజల ధన, మాన, ప్రాణాలను నైతికతను సర్వనాశనం చేస్తున్నారు. ఎవ్వరూ వారిని అడ్డగించేవాడు లేరు. ఇదంతా ఎందుకు ఇలా సాగుతోంది? కారణం కేవలం ఒక్కటే పరిపాలనా యంత్రం చెడిపోయింది. చేతుల్లో శక్తి ఉన్నవారు చెడిపోయారు. వారూ దౌర్జన్యం చేస్తారు, దౌర్జన్యం చేసేవారికి తోడుగానూ నిలుస్తారు. దౌర్జన్యం జరిగేదేదయినా దానికి కారణం వారు జరగాలని కోరుకుంటున్నారు లేదా కనీసం దాన్ని సహిస్తున్నారు.

ఈ ఉదాహరణల ద్వారా మీకు తెలిసిపోయి ఉంటుంది- ప్రభుత్వంలోని

చెడుగు తరచుగా చెడుగులన్నింటికీ మూలమని గ్రహించే ఉంటారు. ప్రజల భావాలు భ్రష్టుపట్టినా, నైతికత దెబ్బతిన్నా, మానవ శక్తులూ సామర్థ్యాలు అపమార్గాలలో వ్యయమవడం, వ్యాపార వ్యవహారాలు తప్పుడు రూపుధరించడం, జీవితపు చెడు విధానాలు చెలామణి అవడం, అన్యాయం, అక్రమం, దౌష్ట్యాలు వ్యాపించడం, మానవాళి నాశనమవడం, ఇదంతా అధికారాల పగ్గాలు చెడ్డవారి చేతుల్లోకి పోయినదాని ఫలితం. శక్తి దుష్టుల హస్తగతమయితే, జనావళి ఉపాధి మార్గాలు ఇలాంటి వారి అధీనంలో ఉంటే వారు స్వయంగానూ చెడును వ్యాపింపజేయడం కాక చెడుగును ప్రతిఫలించే ప్రతిరూపం వీరి సమర్థన, ప్రోద్బ లాలతోనే వ్యాప్తి చెందుతూ ఉంటుంది. అధికారాలు వీరి చేతుల్లో ఉన్నంతకాలం ఏదీ సంస్కరణ చెందజాలదు.

## సంస్కరణకు అనివార్య చర్య

పై విషయం మీరు గ్రహించినట్లయితే జనసామాన్యాన్ని సంస్కరించాలన్నా, ప్రజల్ని వినాశమార్గాల నుండి తప్పించి, శుభసాఫల్యాల మార్గంలోకి తేవాలన్నా పరిపాలనలోని చెడును సంస్కరించడం తప్ప గత్యంతరం లేదని మీరూ గ్రహించే ఉంటారు. సాధారణ బుద్ధి ఉన్న వ్యక్తి కూడా అర్థం చేసుకోగలడు, వ్యభిచారం చేసే స్వేచ్ఛ ఉన్నచోట, వ్యభిచారానికి వ్యతిరేకంగా ఎన్ని ప్రబోధాలు హితబోధలు చేసినా వ్యభిచారం ఆగదు. కాని ప్రభుత్వ అధికారాలను హస్తగతం చేసుకుని వ్యభిచారాన్ని బలం ఉపయోగించి నిషేధించినట్లయితే జనాలు స్వయంగా నిషిద్ధ మార్గాన్ని వదలి నియమ బద్ధమయిన మార్గాన్ని అనుసరిస్తారు. సారాయి, జూదం, వడ్డీ, లంచం, అశ్లీల ప్రదర్శనలు, అర్ధనగ్న దుస్తులు, నీతిలేని వారిగా తయారుచేసే విద్య తదితర విషయాలన్నీ మీరు బోధనల ఉపదేశాల వల్ల దూరం చేయాలని కోరుకుంటే అది సాధ్యపడదు. అదే ప్రభుత్వ బలంతోనయితే ఈ చెడుగులన్నింటినీ దూరం చేయడం సాధ్యమవుతుంది. మానవులను దోచుకునే వారిని, నైతికతను నాశనం చేసేవారిని మీరు హితోపదేశాలు, బోధనలు చేసి వారు తమ ప్రయోజనాలను వదలుకోవాలని కోరుకుంటే అది సాధ్యం కాదు. కాని

అధికారం చేజిక్కించుకుని అధికార బలంతో వీరి దౌష్ట్యాలను అంతమొందిస్తే ఈ చెడుగులన్నీ సమసిపోవడం సాధ్యమే.

అన్యాయం అంతమయి న్యాయం నెలకొనాలని మీరు కోరుకుంటే, భువిలో అల్లకల్లోలాలు సాగరాదని మీరనుకుంటే, మనిషి మనిషి రక్తాన్ని పీల్చరాదని, చిందించరాదని, అణచివేయబడినవారు, పతనమయినవారు ఉద్ధరించబడాలని, మానవులందరికీ సమానంగా గౌరవం, శాంతి, సుసంపన్నతలు పొందే అవకాశాలు ప్రాప్తం కావాలని మీరు వాంఛిస్తే కేవలం ప్రబోధాలు, హితవులు గరిపినంత మాత్రాన ఇదంతా సాధ్యం కాదు. కాని ప్రభుత్వం బలం మీకు తోడయితే ఇదంతా సాధ్యమే. ఒక్క మాటలో ఇది చాలా స్పష్టంగా కానవచ్చే విషయం, చాలా ఎక్కువగా ఆలోచించే అవసరమూలేని విషయం. మానవ సంస్కరణాపథకం ఏదయినా, ప్రభుత్వ అధికారాలను సాధించకుండా నడపడం సాధ్యపడదు. ఎవరయినా వాస్తవంగానే దేవుని భూమిపై నుండి కలతలను కలహాలను రూపుమాపాలని యోచిస్తే, యదార్థంగానే దేవుని సృష్టి అయిన మానవుల సంస్కరణ జరగాలని కోరుకుంటే వారు కేవలం ఉపదేశకులుగా, బోధకులుగా పనిచేయడం వ్యర్థం, వారు లేవాలి, తప్పుడు సిద్ధాంతాల పరిపాలనను అంత మొందించి, దుష్టులయినవారి చేతుల్లో నుంచి అధికారాన్ని కైవసం చేసుకుని సరయిన సిద్ధాంతాలు, సరయిన పద్ధతుల పరిపాలనను సంస్థాపించాలి.

## మానవునిపై మానవుని అధికారం

ఈ అంశం అర్థం చేసుకున్న తరువాత మరో అడుగు ముందుకు వేయండి. మానవాళిలో వ్యాపించే దౌష్ట్యాల మూలాలు చాలా వరకు ప్రభుత్వంలోని చెడుగులో ఉంటాయన్న విషయం మీకు అర్థమయిపోయింది, సాధారణ సంస్కరణకు, ఈ మూలాల సంస్కరణ అవసరమన్నదీ మీకు బోధపడింది. కాని ఒక ప్రశ్న. అసలు ప్రభుత్వంలోని ఈ చెడుగుకు మూలకారణం ఏది? దీని మూల స్థానం ఏది? అందులో చేయవలసిన మౌలిక సంస్కరణ ఏది? పైన పేర్కొన్న చెడుగులు తలెత్తకుండా తీసుకోవలసిన చర్యలేమిటి?

# సమాధానం ఇదే

అన్నింటికీ మూలం మానవునిపై మానవుని అధికారం. దాని సంస్కరణకు మార్గం ఒక్కటే మానవునిపై దేవుని అధికారం కావాలి. ఇంత పెద్ద ప్రశ్నకు ఇంత క్లుప్తమయిన సమాధానం విని మీరు విస్తుపోతున్నారు. ఈ ప్రశ్నను మీరు ఎంతగా అన్వేషించినా మీకు దొరికే జవాబు ఇదొక్కటే.

కాస్త ఆలోచించండి. మీరు బస చేస్తున్న ఈ భూమి దైవం సృష్టించిందా లేక మరెవరయినానా? ఈ మానవులు భూమిపైన నివసిస్తున్నవారు దైవం సృష్టించినవారా లేక మరెవరయినానా? మానవులు ఆధారపడి జీవిక సాగిస్తున్న ఈ అసంఖ్యాక జీవనాధారాలు దేవుడు సమకూర్చినవా మరెవరయినానా? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం ఒక్కటే అయినట్లయితే, అదొక్కటి తప్ప మరేదీ లేనట్లయితే, భూమి, మానవులు, ఈ సాధానా సామగ్రి అంతా దైవం సృష్టించినవే అయినట్లయితే భావం ఏమిటీ? ఈ దేశం దేవునిది, ఈ సంపదలు దేవునివి, ఈ ప్రజలు దేవునికి చెందినవారే; వ్యవహారం వాస్తవంగా ఇదే అయితే మరెవరికయినా దేవుని దేశంలో తన ఆదేశాలను జారీ చేసే హక్కు ఎలా లభిస్తుంది? దేవుని ప్రజల పైన దైవం తప్ప ఇతరుల శాసనం, లేక స్వయంగా ప్రజలే చేసుకున్న శాసనం చెలామణి చేయడం సరయినదెలా అవుతుంది? దేశం ఒకరిది, శాసనం ఆదేశం మరొకరిది ఎలా సాగుతుంది? స్వామ్యం ఒకరిదయితే మరెవరో స్వామి అయి కూర్చోవడం ఎలా సాధ్యం? పాలితులు ఎవరికో చెందిన వారయితే వారిపైన మరెవరో తమ పరిపాలన సాగించడం సరయినదా? మీ బుద్ధి దీన్ని ఏ విధంగా అంగీకరిస్తుంది? ఇది ధర్మానికి వ్యతిరేకం. అందువల్ల ఇలా జరిగిన ప్రతి చోటా, ప్రతి సందర్భంలోనూ ఫలితాలు చెడుగానే బయటపడ్డాయి.

శాసనాలు నిర్మించే, ఆదేశాలు జారీచేసే అధికారాలు ఎవరి చేజిక్కుతాయో వారు కొంత తమ అజ్ఞానం కారణంగా గత్యంతరం లేక తప్పులు చేస్తారు; కొంత తమ మనోకాంక్షల కారణంగా కావాలని అన్యాయానికి, అత్యాచారానికి ఒడిగడతారు. వారికి మానవ వ్యవహారాలను నడిపేందుకు కావలసిన సరయిన నియమాలను,

శాసనాలను చేసేంత జ్ఞానం ఉండదు. ఇంతకన్నా ప్రమాదకరమయిన విషయం, దేవుని భయం లేకపోవడం వల్లనూ, దైవానికి జవాబు చెప్పుకోవలసిన బాధ్యత పట్ల ఏమరుపాటు వల్లనూ వారు కళ్ళెంలేని గుర్రంలా తయారవుతారు. ఈ విషయాన్ని అర్థం చేసుకునేందుకు కాస్తంత బుద్ధి చాలు. దైవభయం లేని మానవుడు, ఎవరికయినా లెక్కలు చూపవలసి ఉందన్న బాధ్యతాభావం లేనివాడు, తన్ను అడిగేవాడు ఎవడూ లేడని అనుకునేవాడు శక్తీ అధికారాలు పొంది కళ్ళెంలేని గుర్రం కాకపోతే మరేమవుతాడు? ఇలాంటి వ్యక్తిని గురించి మీ అభిప్రాయమేమిటీ? ఇతని వద్ద మానవుల ఉపాధి సాధనాలుంటే, మానవుల ధన ప్రాణాలు అతని పిడికిడిలో ఉంటే, వేనవేల తలలు అతని ఆదేశానికి దాసోహమంటుంటే అతను నిజాయితీకి, న్యాయానికి కట్టుబడి ఉంటాడని మీరు అనుకుంటున్నారా? అతడు విధుల విషయంలో విశ్వసనీయుడుగా ఉంటాడా? మీరు ఆశిస్తున్నారా? అతడు హక్కులు కొల్లగొట్టడని, అధర్మంగా కాజేయడని, మానవ సోదరుల్ని తన కాంక్షలకు దాసులుగా చేయడం మానుకుంటాడని మీరు అనుకుంటున్నారా? ఇలాంటి వ్యక్తి స్వయంగాను సన్మార్గాన నడుస్తూ ఇతరుల్నీ నడిపించడం సాధ్యమని మీరు అభిప్రాయ పడుతున్నారా? ఎంత మాత్రం కాదు. ముమ్మాటికీ వీల్లేదు. ఇలా జరగడం హేతువిరుద్ధమయింది. వేనవేల సంవత్సరాల అనుభవం దీనికి భిన్నంగా సాక్ష్యమిస్తోంది, నేడు మీరూ మీ కళ్ళతో చూస్తూనే ఉన్నారు. దైవానికి భయపడనివారు, పరలోకంలో జవాబు చెప్పుకోవడం పట్ల ఏమరు పాటుకులోనయి ఉన్నవారు అధికారాలు దొరకగానే ఏ విధంగా దౌర్జన్యపరులుగా, విశ్వాసఘాతకులుగా, మార్గవిహీనులుగా రూపొందుతారో మన నిత్యానుభవమే.

## మానవునిపైన దేవుని అధికారం

అందువల్ల పరిపాలనలో మౌలికమయిన సంస్కరణ జరగాలి. అది మానవుని మీదినుంచి మానవ అధికారం కాక దేవుని అధికారం నెలకొనాలి. ఈ

పరిపాలనను నడిపేవారు స్వయంగా దేశానికి స్వాములుగా మారకుండా దైవాన్ని తమ పాలకునిగా స్వీకరించాలి. తాము ఆయనకు అధీనమయిన వారుగా, ట్రస్టీలు, ధర్మకర్తలుగా, అప్పగింతను విశ్వసనీయంగా నిర్వహించే వారుగా పనిచేయాలి. ఈ అప్పగింత లెక్కలు చివరికి పాలక ప్రభువుకు చూపవలసి ఉందన్న భావంతో, ఆయన బహిర్గతమయిన దాన్నీ గోప్యంగా ఉన్నదాన్నీ ఎరిగినవాడన్న భావంతో విధులు నిర్వర్తించాలి. చట్టం ఆ ప్రభువు మార్గదర్శకత్వం ఆధారంగా రూపొందాలి, ఆయనకు సమస్త యదార్థాలు బాగా తెలుసు, ఆయన జ్ఞానానికి సరోవరం, ఆయన చేసిన చట్టాన్ని మార్చడానికయినా, అందులో మార్పులూ చేర్పులు చేయడానికయినా ఎవరికీ అధికారాలుండవు. అప్పుడే అవి మానవుని అజ్ఞానం, స్వార్థం, అసమంజస వాంఛల బారి నుండి చెడిపోకుండా సురక్షితంగా ఉంటుంది.

ఇదే మౌలికమయిన సంస్కరణ. ఇస్లామ్ దీన్నే అమలుజరపాలని కోరుతుంది. దైవాన్ని తమ పాలకునిగా (భావపరంగా కాదు, వాస్తవంగా పాలకుడు) అంగీకరించేవారు, దైవం తన ప్రవక్త (స) ద్వారా పంపిన శాసనాంగాన్ని విశ్వసించేవారు తమ పాలకుని రాజ్యంలో ఆయన శాసనాన్నే అమలుపరిచేందుకు లేవాలని ఇస్లామ్ కోరుతుంది. ఆయన పాలిత ప్రజల్లో తిరుగుబాటుదారులయిపోయి స్వయంగానే దేశానికి స్వాములయి కూర్చున్నారో వారి శక్తిని విచ్ఛిన్నం చేయాలని, దేవుని పాలితుల్ని ఇతరుల పాలితులవకుండా కాపాడాలని కోరుతుంది. మీరు దైవాన్ని దైవంగా, దైవ శాసనాన్ని దైవ శాసనంగా అంగీకరించడం ఇస్లామ్ దృష్టిలో సరిపోదు. దీన్ని అంగీకరించిన వెంటనే దానంతట అదే మీకు విధిగా నిర్ణయమవుతుంది- మీరు ఎక్కడున్నా, మీరు ఏ భూభాగంలో ఉన్నా దైవదాసు లయిన మానవుల సంస్కరణకు ఉద్యుక్తులవ్వాలి. పాలకుల తప్పుడు విధానాలను సరయినవాటిగా మలచడానికి కృషి చేయాలి. దైవాన్ని గుర్తించని, కళ్ళెం లేని గుర్రం లాంటి జనుల నుండి చట్ట నిర్మాణం, పరిపాలనా అధికారాలు గ్రహించాలి, దేవుని దాసులకు మార్గం చూపే, నాయకత్వం వహించే బాధ్యతలు చేబూనాలి.

దేవుని శాసనం ప్రకారం పరలోక బాధ్యతాభావంతో, జవాబుదారీ బాధ్యతతో, దేవుడు అగోచర విషయ జ్ఞానం కలవాడన్న నమ్మకంతో పరిపాలనా వ్యవహారాలను నడపాలి. ఈ ప్రయత్నం, ఈ నిరంతర కృషికే జిహాద్ అని పేరు.

## పరిపాలన కఠిన మార్గం

అయితే పరిపాలన, ప్రభుత్వం అన్నవి చెడ్డ పీడల్లాంటివి. అందరికీ తెలిసిన విషయమే. అది ప్రాప్తమయ్యే ఊహ కలగగానే మానవునిలో దురాశ తుఫానయి తలెత్తుతుంది. మనోకాంక్షలు, భూమిలోని నిధినిక్షేపాలన్నీ, ప్రజల మెడలన్నీ మన చేతుల్లోకి రావాలని కోరుకుంటాయి, అప్పుడే మనసారా దైవత్వం చెలాయించవచ్చు. ప్రభుత్వాధికారాలు చేజిక్కించుకోవడం అంతగా కష్టమయిన పని కాదు. ఆ అధికారాలు హస్తగతమయిన తరువాత దేవుడయి కూర్చోవడానికి బదులు దేవుని దాసుడయి పనిచేయడం ఎంతో కష్టతరం? ఒక ఫిర్ఔన్‌ని తొలగించి మీరే ఓ ఫిర్ఔనయి కూర్చుంటే ప్రయోజనమేమిటీ? ఈ మహాపరీక్ష వైపునకు ఆహ్వానించే ముందు ఇస్లామ్ మిమ్మల్ని ప్రప్రథమంగా ఆ కఠిన కార్యం కొరకు సమాయత్తపరచడం అవసరమని భావిస్తుంది. మీరు పరిపాలించే దావా చేస్తూ లేవడానికీ, ప్రపంచంతో దానికోసం పోరాడటానికీ మీ ఆంతర్యంలో నుండి స్వార్థం, అహంభావం పూర్తిగా తొలిగిపోనంతవరకు మీకు ఆ హక్కే ప్రాప్తం కాదు. మీలో పరిశుద్ధ హృదయం ఏర్పడి, మీ పోరు మీ వ్యక్తిగత లేక జాతీయ ప్రయోజనాల కోసంకాక కేవలం దైవ ప్రసన్నత కోసం, ప్రజల సంస్కరణ కోసం మాత్రమే ప్రత్యేకం కానంతవరకు, మీరు పరిపాలనా పాశాలు చేబూని మీ మనోకాంక్షలను అనుసరించకుండా దేవుని చట్టాన్ని అనుసరించడం మీద నిలకడ కనబరిచే సామర్థ్యం మీలో పటిష్ఠం కానంతవరకు మీకు ఆ హక్కు లభించదు. మీరు కేవలం కలిమా పఠించి ఇస్లామ్‌లోకి ప్రవేశించడంతోటే ఇస్లామ్, మీకు జనావళి మీద విరుచుకుపడేందుకు ఆజ్ఞాపించే హక్కు కల్పించదు. ఆ తరువాత మీరు దైవం, దైవప్రవక్త పేరు చెప్పుకుని, దేవుని ద్రోహులు, దౌర్జన్యపరులు చేసే

చేష్టలన్నీ చేసే హక్కు మీకు ప్రాప్తం కాదు. మీకు ఇంత పెద్ద బాధ్యతల్ని మోసే ఆదేశం ఇచ్చేముందు, మీలో ఈ భారాన్ని భరించే సహించే శక్తిని పెంపొందించడం అవసరమని ఇస్లామ్ భావిస్తుంది.

## ఆరాధనలు - శిక్షణ

నమాజ్, రోజా, జకాత్, హజ్ నిజానికి ఈ శిక్షణ తర్ఫీదుల కోసమే. ప్రపంచంలోని ప్రభుత్వాలన్నీ తమ సేన, పోలీసు, సవిల్ సర్వీస్ కోసం ఉద్యోగులకు ముందు ప్రత్యేకమయిన శిక్షణ గరిపి తరువాత వారిచేత సేవలు చేయించుకున్నట్లు దైవధర్మం (ఇస్లామ్) కూడా దాని సేవకు అంకితమయ్యే జనులనందరికీ మొదట ప్రత్యేక పద్ధతిలో తర్ఫీదునిస్తుంది తరువాత వారి జిహాద్, దైవ పరిపాలనా సేవలు గ్రహిస్తుంది. వ్యత్యాసం ఏమిటంటే ప్రపంచ ప్రభుత్వాలు తమ ఉద్యోగుల ద్వారా చేయించదలచిన పనుల్లో నైతికత, సత్యసంధత, సదాచారం, దైవభక్తి లాంటి విషయాలు అవసరముండవు. అందువల్ల అవి వారిని కేవలం కార్యకర్తలుగా తయారుచేసే ప్రయత్నంచేస్తుంది. వారు వ్యభిచారులయినా, తాగుబోతులయినా, విశ్వాస ఘాతకులయినా, దుష్టస్వభావులయినా పట్టించుకోవడం జరగదు. కాని దైవధర్మం తన వారి ద్వారా చేయించదలచిన కార్యం మొత్తం నైతికమయినదే గనక అది కేవలం కార్యకర్తల్ని తయారు చేయడం కన్నా వారిని ధర్మవర్తనులుగా దైవభక్తులుగా తయారుచేయడానికి ప్రాముఖ్యాన్నిస్తుంది. వారు ప్రపంచంలో దేవుని ప్రాతినిధ్యపాలనను నెలకొలిపే దావా చేస్తూ నిలబడినప్పుడు తమ దావాను నిజం చేసి చూపెట్టేంత శక్తిమంతులుగా తయారు చేయగోరుతుంది. వారు పోరాడితే తమకు ధనం, సంపదలు, భూమి కావాలని కాదు, వారి ఆచరణ ద్వారా వారు కేవలం దైవప్రసన్నత కోసం మాత్రమే పోరాడుతున్నారన్న విషయం, మానవాళి శ్రేయసాఫల్యాల కోసం పోరాడుతున్నారన్న విషయం రుజువుకావాలి. వారు విజయం సాధిస్తే దురహంకారులు, తలబిరుసుగల వారిగా మారకూడదని, వారు దైవం ఎదుట తలవంచే వారుగా రూపొందాలని కోరుతుంది. వారు అధికారులయితే జనాలను తమ దాసులుగా చేయరాదు, వారు భూమిలోని

నిధులకు అధిపతులయితే తమకు లేక తమ కుటుంబం వారికి లేక తమ జాతివారికి జేబులు నింపే పని చేపట్టేవారు కారాదు, దైవం ప్రసాదించిన ఉపాధి మార్గాలను ఆయన దాసుల మధ్య న్యాయం రీత్యా విభజించే వారు కాగలగాలి. అప్పగింత అప్పగించబడినప్పుడు ఒక నిజమయిన విశ్వాసనీయునిలా ఒక కన్ను మనల్ని కనిపెట్టుకుని ఉందని, మేము ఒక్కొక్క పైసా లెక్క చూపవలసిన పరమాధికారి ఒకడు మాపైన ఉన్నాడని భావిస్తూ పనిచేయాలి. ఈ శిక్షణ కొరకు ఈ ఆరాధనలు తప్ప మరో విధానం సాధ్యమేకాదు. ఇస్లామ్ ఈ విధంగా తన మనుషుల్ని తయారుచేసుకున్నప్పుడు వారితో, ఇక భూతలం మీద అందరికన్నా సదాచారులయిన దైవదాసులు మీరే, ముందుకు నడవండి, దైవధిక్కారుల్ని ఏలుబడి నుండి తొలగించండి, దైవప్రాతినిధ్య పరిపాలనా బాధ్యతలు చేతుల్లో తీసుకోండి అని అంటుంది.

"మానవుల మార్గదర్శకత్వానికి, సంస్కరణకు రంగంలోకి తీసుకురాబడిన ఉత్తమ సముదాయం మీరే. మీరు మంచిని ఆదేశిస్తారు, చెడును నిరోధిస్తారు, దైవాన్ని విశ్వసిస్తారు." (ఆలి ఇమ్రాన్ :110)

## దైవాజ్ఞ పాలనలోని శుభాలు

మీరే కాస్త ఆలోచించండి. సేన, పోలీసు, జైలు వ్యవస్థలు, శిస్తు వసూలు చేసే, పన్నులు వసూలు చేసే వ్యవస్థలు ఇంకా ఇతర ప్రభుత్వ కార్యాలన్నీ, దైవానికి భయపడే, పరలోకపు జవాబుదారీ భావంతో జీవించే ఉద్యోగులు, అధికారుల చేతుల్లో ఉన్నట్లయితే, అక్కడ సకల నియమాలు, సమస్త నిబంధనలు దైవం ప్రసాదించిన మార్గదర్శకత్వంలో నెలకొలివి నట్లయితే, ఆ మార్గదర్శకత్వంలో ఎలాంటి అన్యాయమయినా, అజ్ఞాన మయినా చోటుచేసుకునే ప్రసక్తే లేనప్పుడు, చెడులు, చెడ్డ పనులు ఏ రూపంలోనున్నా సమయానికి నిరోధించే ఏర్పాటున్నట్లయితే మంచినీ మంచి పనుల్ని ప్రతి రూపంలోనూ ప్రభుత్వం తన ధనాగారం, శక్తుల ద్వారా ప్రవర్ధమానం చేయడానికి సన్నద్ధమయి ఉన్నట్లయితే- ఇలాంటి చోట మానవాళి సౌభాగ్యాన్ని గురించి ఏమనగలం?

మీరు ఇంకా కాస్త ఆలోచించండి, ఇలాంటి ప్రభుత్వం ఒకటి కొంతకాలం పనిచేసి జనుల చెడ్డ అలవాట్లను సంస్కరించినప్పుడు, అది అధర్మసంపాదన, నీతిబాహ్య కార్యకలాపాలు, దౌర్జన్యం, అశ్లీలం, అనైతిక వ్యవహారాల సమస్త ద్వారాలు మూసివేసినప్పుడు, అది అపసవ్యమయిన బోధనా శిక్షణల్ని రద్దు చేసి సవ్యమయిన విద్యాబుద్ధుల ద్వారా జనుల ఆలోచనల్ని సక్రమం చేసినప్పుడు, దాని నీడన న్యాయం, ధర్మం, శాంతి, భద్రతలు, రుజువర్తనం నిండిన, నీతిమంత మయిన, పరిశుద్ధ వాతావరణంలో జనం బ్రతికే అవకాశం ప్రాప్తమయినప్పుడు దుర్వర్తనులు, దైవధిక్కారులయిన వారి నాయకత్వంలో సుదీర్ఘ కాలం వరకు జీవించడం వల్ల చూపుకోల్పోయిన కళ్ళు క్రమంగా స్వయంగానే సత్యాన్ని వీక్షించడానికి, గుర్తించడానికి సిద్ధమవుతాయి. శతాబ్దుల తరబడి నీతివిహీనతల మధ్య ఆవరించబడి ఉండటం మూలంగా తుప్పుపట్టిపోయిన హృదయాలు క్రమేణ స్వయంగానే అద్దంలా తేటతెల్లమవుతూ పోతాయి. వాటి సత్యబింబాన్ని గ్రహించే సామర్థ్యం పెరుగుతుంది. ఆనాడు ఈ సరళమయిన మాటను అర్థం చేసుకోవడం, అంగీకరించడం ఏ మాత్రం కష్టం కాజాలదు. నిజానికి అల్లాహ్ ఒక్కడే తమ దైవమని, ఆయన తప్ప దాస్యం చేయడానికి తగడని, మనకు నిజమయిన ధర్మాన్ని , శాసనాంగాన్నీ అందజేసిన వారు వాస్తవంగానే సత్యవంతు లయిన ప్రవక్తలని గ్రహించడం జనానికి చాలా సులభమవుతుంది.

నేడు ఏ మాటను మనుషుల మస్తిష్కాలలోకి ఎక్కేలా చేయడం ఎంతో కష్టమనిపిస్తున్నదో అది ఆనాడు అతిసునాయాసంగా తానే బుర్రలకెక్కుతుంది. నేడు ఉపన్యాసాల ద్వారా, పుస్తకాల ద్వారా ఏ మాటను బోధపరచడం సాధ్యపడదో ఆ రోజున ఆ మాట ఎలాంటి చిక్కులేనే లేని మాటగా సుబోధకమయిపోతుంది. మానవ కల్పిత విధానాల ద్వారా ప్రపంచ పనులు చక్కబెట్టడం వల్ల ఎలాంటి పరిస్థితులు నెలకొంటాయో, దైవం చూపిన విధానాన్ని అవలంబిస్తే ఎలా పరిస్థితులు రూపొందుతాయో వీటి మధ్యన తారసిల్లే వ్యత్యాసాన్ని కళ్ళారా చూసుకున్నవారి స్థితి ఎలా ఉంటుందో చెప్పనక్కరలేదు. వారు దేవుని ఏకత్వాన్ని దైవప్రవక్త సత్యతను విశ్వసించడం సులువవుతుంది. విశ్వసించకపోవడం కష్టమవుతుంది.

పువ్వులు, ముళ్ళ మధ్య వ్యత్యాసం అవగతమయిన తరువాత పువ్వుల్ని ఎన్నుకోవడం సులభతరం, ముళ్ళను వెదకడం కష్టతరమయినట్లు వారి స్థితి మారుతుంది. ఆ సందర్భంలో ఇస్లామ్ సత్యతను కాదనడం, దైవ తిరస్కారం, బహుదైవారాధనల పైన పట్టుపట్టడం అత్యంత సంక్లిష్టమయిన మొండివైఖరి అవసరమవుతుంది, వెయ్యిలో అతి కష్టం మీద అయిదు పది మంది ఇలాంటి అతి మొండి వైఖరి గలవారు కానరావచ్చు.

సోదరులారా, ఈ నమాజ్, రోజా, హజ్, జకాత్ ఆరాధనలన్నీ ఏ ఆశయాన్ని సాధించడానికో ఇప్పుడు మీరు బాగా అర్థం చేసుకున్నారని ఆశిస్తున్నాను. ఈ ఆరాధనలు కేవలం పూజాపురస్కారాల్లాంటివి మాత్రమే అన్న అపోహ మీలో బహుకాలంగా కలిగిస్తూ వచ్చారు, మీరున్నూ అదే నిజమని భావిస్తూ వచ్చారు. ఇదంతా ఒక మహా సేవ కోసం మిమ్మల్ని సమాయత్తపరిచేందుకు ఉద్దేశించబడినవే అని మీకు అసలు తెలుపడమే జరగలేదు. ఈ కారణం వల్ల మీరున్నూ ఎలాంటి లక్ష్యం లేకుండా ఈ ఆచారాలను పాటిస్తూ వచ్చారు. వీటిని అసలు ఏ లక్ష్యం కోసం నిర్ణయించడం జరిగిందో దానికి సిద్ధమవ్వాలన్న ఆలోచన కూడా మీ మనస్సుల్లో ఎన్నడూ జనించలేదు. కాని ఇక నేను మీకు తెలుపుతున్నాను. ఏ హృదయంలోనయితే జిహాద్ ఈ సతత సమరం సంకల్పం ఉండదో, ఏ వ్యక్తి దృష్టిలో ఈ నిరంతర కృషి ఆశయముండదో అతని ఆరాధనలన్నీ అర్థరహితం. ఈ అర్థరహితమయిన ఆరాధనల అనుసరణ వల్ల దైవసాన్నిధ్యం ప్రాప్తమవుతుందని మీరు ఆశిస్తున్నట్లయితే మీరు దైవం సమక్షంలో హాజరయినప్పుడు చూసుకుంటారు అవి మీకు ఎంత సామీప్యాన్ని ప్రసాదించాయో!

# జిహాద్ ప్రాముఖ్యం

ముస్లిమ్ సోదరులారా, దీనికి పూర్వం ఒకసారి నేను మీకు ధర్మం, షరీఅత్, ఇబాదత్ అన్న మాటల అర్థాలు చెప్పాను. ఇక కాస్త మీ మస్తిష్కంలో పునశ్చరణ చేసుకోండి:

ధర్మం అంటే విధేయత
షరీఅత్ అంటే చట్టం
ఆరాధన అంటే దాస్యం.

## ధర్మం అంటే?

మీరు ఒకరికి విధేయులయ్యారంటే, అతన్ని తన పాలకునిగా అంగీకరించారంటే భావం మీరు అతని ధర్మాన్ని స్వీకరించారన్నమాట. అతను మీ పాలకుడు అయినప్పుడు, మీరు అతని పాలితులయినప్పుడు, అతని ఆదేశాలు, ఆయన నియమించిన నిబంధనలు మీకు చట్టాలు, షరీఅత్ అయ్యాయి. మీరు అతని విధేయత పాటిస్తూ అతని షరీఅత్ ప్రకారం జీవితం గడుపుతున్నప్పుడు, అతను కోరింది సమర్పించి, ఇచ్చిన ఆదేశాన్ని పాటించినప్పుడు, అతను వద్దన్న పనులను మానుకుని, అతను ఏ హద్దుల్లో ఉంటూ పని చేయడం న్యాయసమ్మతమని నిర్ణయిస్తాడో వాటి లోపలే ఉంటూ పని చేసినప్పుడు, మీరు పరస్పరం మీ వ్యవహారాలు, సంబంధాలు, వ్యాజ్యాలు, తగాదాలు అన్నిటా అతని నిర్దేశాల కనుగుణంగానే ఆచరిస్తూ ఉన్నప్పుడు, ఆయన తీర్పులను నిర్ణయాలను వినమ్ర శిరస్సులయి స్వీకరించినప్పుడు - ఈ వైఖరి అంతా దాస్యం లేక ఆరాధన అనబడుతుంది. ఈ వివరణ వల్ల ఒక విషయం స్పష్టమవుతుంది. ధర్మం అని వాస్తవానికి ప్రభుత్వాన్ని అంటారు. షరీఅత్ ఆ ప్రభుత్వ శాసనాంగం, ఆరాధన దాని చట్టం, నియమాల పాలన. మీరు ఎవరిని అధికారిగా పాలకునిగా స్వీకరించి అతనికి పాలితునిగా ఉండడానికి అంగీకరించినా వాస్తవంగా మీరు అతని ధర్మంలోకి ప్రవేశిస్తారన్నమాట. మీ ఆ పాలకుడు అల్లాహ్ అయినట్లయితే మీరు దేవుని ధర్మంలోకి ప్రవేశిస్తారు. ఆ పాలకుడు రాజు అయినట్లయితే మీరు ఆ రాజు ధర్మంలోకి చేరినట్లు. అది ఏదయినా ప్రత్యేక జాతి అయినట్లయితే మీరు ఆ జాతి ధర్మంలో చేరినట్లు. అది స్వయంగా మీ జాతి, మీ దేశ ప్రజలయితే మీరు మీ ప్రజాధర్మంలో చేరినట్లు. ఒక్క మాటలో, మీరు ఎవరి విధేయతాపాశం మీ

కంతాన బంధించబడుతుందో నిజానికి మీరు దాని ధర్మంలోనే ఉన్నారన్న మాట. మీరు ఎవరి శాసనాంగాన్ని అమలు జరుపుతున్నారో నిజానికి మీరు వారినే ఆరాధిస్తున్నారన్న మాట.

## మానవునికి రెండు ధర్మాలు కాజాలవు

పైన వివరించిన విషయాలు మీకు బోధపడినట్లయితే మానవునికి రెండు ధర్మాలు ఏ విధంగానూ వర్తించవు అన్న సరళమయిన విషయమూ మీరు సులభంగా అర్థం చేసుకోగలరు. విభిన్న పాలకుల మధ్య మీరు కేవలం ఒక్క పాలకునికే విధేయత పాటించగలరు. విభిన్న శాసనాలలో కేవలం ఏదో ఒక్క శాసనాన్నే మీరు మీ జీవన నియమావళిగా చేసుకోగలరు. విభిన్న ఆరాధ్యులు కేవలం ఒక్క ఆరాధ్యుణ్ణి ఆరాధించడమే మీకు సాధ్యమవుతుంది. ఒక పద్ధతి మీరు ప్రతిపాదించవచ్చు. విశ్వాసం రీత్యా ఒకరిని పాలకునిగా అంగీకరించాలి, వాస్తవానికి ఇతరునికి విధేయత చెల్లించాలి, పూజాపురస్కారాలు మరొకరికి అర్పించుకోవాలి; ఇంకొకరి దాస్యం చేయాలి; అలాగే మనసులో ఒక శాసనాంగాన్ని విశ్వసించాలి, యదార్థ జీవితంలో సకల వ్యవహారాలు మరొక శాసనాంగం రీత్యా నిర్వహించాలి; నేనూ ఏకీభవిస్తాను- ఇదంతా నిస్సందేహంగా సాధ్యమే; సాధ్యమేమిటీ ఇదే జరుగుతోంది కూడా. కాని దీన్నే షిర్క్ అంటారు- బహు దైవారాధన అంటారు. మరి షిర్క్ ఏమో ఆసాంతం అబద్ధం, అసత్యం.

నిజానికి మీరు ఎవరి విధేయత ఆచరణాత్మకంగా పాటిస్తున్నారో వారి ధర్మాన్నే స్వీకరించారు. అలాంటప్పుడు మీరు ఎవరి విధేయతనయితే పాటించరో అతనికి తన పాలకునిగా అతని ధర్మాన్ని తమ ధర్మంగా ప్రకటించడం అబద్ధం, అసత్యం కాకపోతే మరేమిటీ? మీరు నోటితో పలికినా మనసులో అనుకున్నా దాని ప్రయోజనం ఏమిటీ? దాని ప్రభావం ఏముంటుంది? మేము ఆయన శాసనాంగాన్ని (షరీఅత్‌ని) విశ్వసిస్తున్నా మనడం, వాస్తవంగా మీ జీవన వ్యవహారాలన్నీ ఆయన షరీఅత్ పరిధికి వెలుపలే ఉన్నప్పుడు, ఇతరుల షరీఅత్‌ని అనుసరించి

సాగుతున్నప్పుడు పూర్తిగా అర్థరహితం కదా! మేము ఫలానా శక్తిని దైవంగా విశ్వసిస్తున్నామని మీరు అనడం, మీ మెడలపైని తలల్ని మాత్రం ఆయన ముందు సజ్దాలో నేలకు ఆనించడం పూర్తిగా ఒక కృత్రిమ చర్యగా మిగిలిపోతుంది, ఎందుకంటే వాస్తవంగా మీరు దాస్యం మరొకనికి చేస్తున్నారు. ఎవరి ఆదేశాలనయితే మీరు పాలిస్తున్నారో నిజానికి మీ ఆరాధ్యుడు అతనే, వాస్తవంగా మీరు అతన్నే ఆరాధిస్తున్నారు. ఎవరు మిమ్మల్ని ఒక పని చేయరాదని వారిస్తే మీరు ఆగిపోతారో, ఎవరు నెలకొలిపిన హద్దుల్లో ఉంటూ మీరు మీ పనులు నెరవేర్చుకుంటారో, ఎవరు నిర్ణయించిన విధానాలను మీరు అనుసరిస్తారో, ఎవరి నియమాలకనుగుణంగా మీరు ఇచ్చిపుచ్చుకోవడాలు చేస్తారో, మీ వ్యవహారాల తీర్పుల కోసం మీరు ఎవరి వైపునకు మరలుతారో, ఎవరి శాసనాల ఆధారంగా మీ పరస్పర సంబంధాల నిర్వహణ, మీ మధ్య హక్కుల పంపిణీ జరుగుతుందో, ఎవరు కోరితే మీరు మీ మనోమస్తిష్కాల, కాళ్ళూ చేతుల సమస్త శక్తుల్ని, మీరు సంపాదించిన సొమ్మును, చివరికి మీ ప్రాణాలను సయితం సమర్పించడానికి సిద్ధమవుతారో అతడే మీ ఆరాధ్యుడు, అతనినే మీరు ఆరాధిస్తున్నారు.

అంటే మీ విశ్వాసం ఒకటయి, వాస్తవం దానికి విరుద్ధంగా ఉన్నట్లయితే, వాస్తవికతనే పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుంది. మీ విశ్వాసానికి ఇలాంటి పరిస్థితిలో స్థానముండదు. ఇలాంటి విశ్వాసానికి ఎలాంటి విలువా ఉండదు. వాస్తవంగా మీరు రాజుగారి ధర్మాన ఉంటే అందులో దైవధర్మానికి చోటు ఉండదు. యదార్థానికి మీరు ప్రజాస్వామ్య ధర్మాన్ని పాటిస్తున్నట్లయితే, ఇంగ్లీషు వారి ధర్మాన్ని అనుసరిస్తున్నట్లయితే, జర్మను ధర్మాన్ని, దేశ ధర్మాన్ని పాటిస్తున్నట్లయితే అందులోనూ దైవధర్మానికి ఎలాంటి స్థానముండదు. కాని అలాగే మీరు వాస్తవంగా దైవధర్మాన ఉంటే, అందులోనూ ఇతర ధర్మాలకు చోటుండదు. ఇంతకు ఒకటి మాత్రం బాగా అర్థం చేసుకోండి, షిర్క్ లేక బహుదైవారాధన ఎక్కడున్నా అది అబద్ధమే, అసత్యమే.

# ప్రతి ధర్మం అధికారం కోరుతుంది

పై మాట కూడా మీకు బోధపడితే ఇక మరెంతో సుదీర్ఘమయిన చర్చ అనవసరం, మీ మస్తిష్కం స్వయంగానే ఫలితాన్ని అందుకుంటుంది: ధర్మం ఏదయినా సరే అనివార్యంగా అది తన ప్రభుతను, పాలనను కోరుతుంది. ప్రజాస్వామ్య ధర్మమయినా, రాచరిక ధర్మమయినా, సామ్యవాద ధర్మమయినా, దైవ ధర్మమయినా, మరే ధర్మమయినా, ప్రతి ధర్మం నిలబడాలంటే దానికి దాని ప్రభుత అవసరం. ప్రభుత లేకుండా ధర్మం అన్నది, నేల పైన కట్టడం లేని మనస్సులోని ప్లాను, పథకం లాంటిది. ఇలాంటి మనసులోని పథకానికి విలువేమిటీ? ప్రయోజనమేమిటీ? నిజానికి మీరు నివసించేది వాస్తవంగా నేలపైన నిలిచి ఉండే కట్టడంలోనే కదా. దాని ద్వారాల గుండానే అందులో ప్రవేశిస్తారు, ఆ ద్వారాల గుండానే బయటికీ వస్తారు. ఆ కట్టడం కప్పు, గోడల నీడనే మీరు విశ్రమిస్తారు. దాని నిర్మాణ పథకం ప్రకారమే మీరు మీ నివేశనకు సంబంధించిన ఏర్పాట్లన్నీ చేసుకోవలసి ఉంటుంది. ఒక నిర్మాణ పథకానికి కట్టుబడి నిర్మించిన కట్టడంలో ఉంటూ మీరు మరో విధమయిన కట్టడం రూపకల్పన మీ మనస్సులో పెట్టుకోవడం, లేక దాని పట్ల విశ్వాసం కలిగి ఉండటంలో ఏమయినా అర్థముందా? ఆ ఊహాజనితమయిన కట్టడమయితే మీ మనస్సులో మటుకే ఉంటుంది. కాని మీరయితే నేలపై నిర్మాణమయి ఉన్న వాస్తవ కట్టడంలోనే ఉంటారు. 'కట్టడం' అనే పదం మనస్సులో ఉండే రూపానికయితే ఎవరూ పలకరు. అలాంటి కట్టడంలోనూ ఎవ్వరూ ఉండజాలరు. పునాదులు భూమిలో ఉంటూ భూమిపై గోడలూ కప్పు ఉన్నదాన్నే కట్టడం అంటారు; మనిషి అందులోనే నివసించగలుగుతాడు కూడా. ఇదే ఉదాహరణకు అనుగుణంగా చూడండి. ఒక ధర్మం సత్యమయిందన్న కేవలం నమ్మకానికి ఏ అర్థమూ లేదు; జనం ఆచరణాత్మకంగా మరో ధర్మం ప్రకారం జీవిస్తూ ఉన్నప్పుడు కేవలం ఆ నమ్మకానికి ప్రయోజనం ఏమిటీ? ఊహల్లోని చిత్రాన్ని కట్టడమని ఎలా అనరో అలాగే ఊహల్లోని ధర్మాన్ని ధర్మం అనరు. ఊహాభవనంలో మనిషి నివసించలేనట్లే ఊహ

ధర్మంలోనూ మనిషి జీవించలేడు. నేలపై అధికారం నెలకొన్నదే అసలు ధర్మం. దాని శాసనం చెలామణి కావాలి, దాని నియమానుసారం జీవన వ్యవహారాలు పరిష్కారం కావాలి. కనుక తేలిందేమిటంటే ప్రతి ధర్మం సరిగ్గా తన నైజం రీత్యానే తన ప్రభుత్వం కావాలని కోరుతుంది. ఏ అధికారాన్ని ధర్మం అంగీకరింపజేస్తుందో ఆ అధికార ఆరాధనే జరగాలని, దాని దాస్యమే జరగాలని, దాని షరీఅత్ చట్టమే చెలామణి కావాలని అది కోరుతుంది. ఉదాహరణకు:

## ప్రజాస్వామ్య ధర్మం

ప్రజాస్వామ్య ధర్మం అంటే భావమేమిటీ? ఒక దేశంలో జన సామాన్యమంతా స్వయంగా తమ అధికార సత్తాకు తామే స్వాములు కాగలగాలి. వారి మధ్యన స్వయంగా వారు చేసుకున్న చట్టమే చెలామణి కావాలి. దేశ ప్రజలందరూ తమ ప్రజాస్వామ్య అధికారానికి విధేయత, దాస్యం చేయాలి. దేశంలో నిజంగానే జనసామాన్యానికి అధికార సత్తాపై అధీనం ప్రాప్తం కాకపోతే, ప్రజాస్వామ్య షరీఅతె చెలామణి కాకపోతే ఈ ధర్మం ఎలా నెలకొంటుందో కాస్త చెప్పండి? జన సామ్యానికి బదులు ఒక జాతి లేక ఒక రాజు అధికారం దేశంలో స్థాపించబడితే, వారి షరీఅతె చెలామణిలోకి వస్తే, ఎవరయినా ప్రజాస్వామ్య ధర్మాన్ని విశ్వసించనయితే విశ్వసించవచ్చు, కాని రాజు అధికారమో మరో జాతి అధికారమో అక్కడ స్థాపితమయి ఉన్నంత వరకు వారు ప్రజాస్వామ్య ధర్మాన్ని అనుసరించడం సాధ్యం కాదు.

## రాచరిక ధర్మం

రాచరిక ధర్మాన్నే తీసుకోండి. ఈ ధర్మం ఏ రాజును అధికార సత్తా గలవానిగా నిర్ణయిస్తుందో, అతన్నే అనుసరించాలని, అతను చేసిన చట్టమే చెలామణి అవ్వాలనే కదా కోరుతుంది. అలాకాకపోతే రాజును రాజుగా అంగీకరించడం, అతన్ని ఉన్నత అధికార సత్తా గలవానిగా అంగీకరించడంలో గల అర్థమేమిటీ? ప్రజాస్వామ్య ధర్మం చెలామణిలోకి వస్తే లేక ఇతర జాతి

ప్రభుత నెలకొంటే రాచరిక ధర్మం ఎక్కడ మిగులుతుంది, దాన్ని ఎవరయినా అనుసరించడానికి?

## ఆంగ్ల ధర్మం

దూరమెందుకు, మన దేశంలో సాగుతున్న ఆంగ్ల ధర్మాన్నే చూడండి,★ ఈ ధర్మం కొనసాగుతోందంటే భారత శిక్షాస్మృతి, సివిల్ చట్టాలు ఆంగ్లేయుల శక్తితోనే చెలామణీ అవుతున్నాయి. మీ జీవిత వ్యవహారాలన్నీ ఆంగ్లేయులు నియమించిన విధానాల రీత్యా, వారు ఏర్పరచిన హద్దుల లోబడి నెరవేరుతాయి. మీరంతా దాని ఆదేశానికి విధేయత శిరస్సును వంచి జీవిస్తున్నారు. ఈ ధర్మం ఈ శక్తి ఆధారంగా సంస్థాపితమయి ఉన్నంత కాలం, మీరు ఏ ధర్మాన్ని నమ్మేవారయినా దానికి ఇక్కడ ఎట్టి స్థానం లేదు. కాని ఒకవేళ ఆంగ్లేయులు చేసిన భారత శిక్షాస్మృతి, సివిల్ చట్టాలు చెలామణీ కాకపోతే ఇక ఆంగ్లేయుల ఆదేశాలకు విధేయత, అనుసరణ జరగకపోతే ఇక ఆంగ్ల ధర్మానికి అర్థం ఏముంటుందో కాస్త మీరే చెప్పండి.

## ఇస్లామ్ ధర్మం

ఇదే వ్యవహారం ఇస్లామ్ ధర్మానికీ వర్తిస్తుంది. దీని ప్రాతిపదిక ప్రకారం భువికి స్వామి, మానవుల సామ్రాట్టు కేవలం పరమ ప్రభువు అల్లాహ్ ఒక్కడే. అందువల్ల విధేయత ఆయనకే చెల్లించాలి, ఆయనకే దాస్యం చేయాలి; ఆయన షరీఅత్ ననుసరించే మానవ జీవిత వ్యవహారాలన్నీ పరిష్కారం కావాలి. అల్లాహ్ మాత్రమే సర్వసత్తాక శక్తి అన్న సూత్రం ఇస్లాం ప్రతిపాదిస్తుంది. దీని ఉద్దేశ్యం కూడా, భూమిపైన కేవలం అల్లాహ్ ఆదేశం నెరవేరాలని, న్యాయస్థానాల్లో ఆయన షరీఅత్ ఆధారంగానే తీర్పులు జరగాలని, పోలీసులు ఆయన ఆదేశాలనే జారీ

---

★ ఈ జుమా ప్రసంగాలు 1938-39 మధ్యన చేసినవని, అప్పుడు మన దేశం ఆంగ్లేయుల పాలనలో ఉండేదని మరువరాదు.

చేయాలని, ఇచ్చిపుచ్చు కోవడాలు ఆయన చేసిన నియమాల ప్రకారమే జరగాలని, పన్నులు ఆయన అభీష్టం ప్రకారమే వెయ్యాలని, ఆ ధనం ఆయన నిర్ణయించిన పద్దుల్లోనే ఖర్చుకావాలని, సివిల్ సర్వీసులు, సేవలు ఆయన ఆజ్ఞాబద్ధమయి ఉండాలని, జనుల శక్తి సామర్థ్యాలు, కృషి, ప్రయత్నాలు సర్వం ఆయన మార్గంలో జరగాలని, ఆయన పట్లనే భయభక్తులు, ఏర్పడాలని, ప్రజలు ఆయనకే విధేయులయి ఉండాలని, మొత్తానికి మానవాళి ఆయనకు తప్ప మరెవరికీ దాసులయి జీవించరాదని- ఇదే ఉద్దేశ్యం తప్ప మరొకటి కాదు.

ఈ ఉద్దేశ్యం నెరవేరాలంటే స్వచ్ఛమయిన దైవికమయిన ప్రభుత్వం నెలకొనంత వరకు సాధ్యం కాదు. మరో ధర్మంతో ఈ ధర్మం భాగస్వామ్యం స్వీకరించే ఆస్కారం ఎక్కడుంది? మరొక ధర్మంతో భాగస్వామ్యాన్ని అంగీకరించే ధర్మం కూడా ఏదుందనీ? అన్ని ధర్మాలలా ఈ ధర్మం కూడా అధికార సత్తా ప్రత్యేకంగా స్వచ్ఛంగా తనదే చెలామణి కావాలని, ఇతర ధర్మాలన్నీ తన సమక్షంలో అణగి, తన అదుపు ఆజ్ఞల్లో ఉండాలని, లేకపోతే తన విధేయత అనుసరణ సాగదని అంటుంది. తానుంటే, ప్రజాస్వామ్య ధర్మమూ చెల్లదని, రాచరిక ధర్మమూ చెల్లదని, సామ్యవాద ధర్మమూ చెల్లనేరదని, మరే ఇతర ధర్మమూ చెల్లుబాటు కాదని, ఇతర ధర్మమేదీ ఉన్నా తానుండదని, ఇలాంటి సందర్భంలో కేవలం తనను సత్యమయినదని అంగీకరించడం వల్ల ప్రయోజనమేమీ లేదని అంటుంది. ఈ మాటనే దివ్యఖుర్‌ఆన్ మాటిమాటికీ చెబుతుంది:

> ప్రజలు అన్ని వైపుల నుండి విముఖులయి తమ దర్మాన్ని అల్లాహ్ కొరకు ప్రత్యేకించుకుని ఆయన్నే ఆరాధించాలని తప్ప ప్రజలకు మరో ఆదేశమేదీ ఇవ్వబడలేదు.
> (అల్ బయ్యినహ్ : 5)

> (అల్లాహ్) ఆయనే; ఆయన తన సందేశహరుణ్ణి మార్గదర్శకత్వం, సత్యధర్మం ఇచ్చి పంపించాడు. ఆ ధర్మాన్ని మొత్తం ధర్మవ్యవస్థ అంతటి పైనా ఆధిక్యత చేకూర్చడానికి, దీనికి ప్రతిగా దైవత్వంలో సహవర్తులను అంగీకరించేవారికి ఇది ఎంతగా అయిష్టకరమయినా సరే.
> (అత్ తౌబా : 33)

వారితో పోరాడండి, కల్లోలం సమసిపోనంతవరకు, ధర్మం యావత్తూ అల్లాహ్‌కే ప్రత్యేకం కానంతవరకు. (అల్ అన్‌ఫాల్ : 39)

ఆదేశం ఇవ్వడం అన్నది అల్లాహ్‌కు తప్ప మరెవ్వరికీ చెల్లనేరదు. ఆయన్ని తప్ప మరెవ్వరినీ ఆరాధించరాదన్నది స్వయంగా ఆయన ఆదేశమే.

(యూసుఫ్ : 40)

మరెవరయితే తన ప్రభువును కలుసుకోవడాన్ని ఆశిస్తున్నాడో అతను సత్కార్యాలాచరించాలి, తన ప్రభువు ఆరాధనలో మరెవరి ఆరాధననూ చేర్చకూడదు. (అల్ కహఫ్ : 110)

నీవు చూడలేదు, కొందరు, తాము విశ్వసించామని, నీకు అవతరించిన బోధనను, నీకు పూర్వపు ప్రవక్తలకు అవతరించినదాన్నీ నమ్ముతున్నామని అంటారు. అయితే తమ వ్యాజ్యాలను దైవేతర శక్తుల వద్దకు తీర్పు కోసం తీసుకువెళ్ళాలని అభిప్రాయపడతారు. నిజానికి వారికి దైవేతర శక్తులను తిరస్కరించాలని, ఆదేశించడం జరిగింది.... మేము ఏ ప్రవక్తను పంపినా అల్లాహ్ అనుజ్ఞ మేరకు అతన్ని అనుసరించాలన్న ఉద్దేశంతోనే పంపాము.

(అన్ నిసా : 60-63)

పైన ఆరాధన, ధర్మం, షరీఅత్ అనే పదాలకు నేను చెప్పిన వివరణ తరువాత, ఈ ఆయత్‌లలో ఖుర్ఆన్ చెప్పేదేమిటో అర్థం చేసుకోవడం మీకు కష్టం కాదని అనుకుంటున్నాను.

## ఇస్లామ్‌లో జిహాద్

ఇప్పుడు, ఇస్లామ్‌లో జిహాద్‌కు ఇంత ప్రాముఖ్యం ఎందుకుందో బాగా స్పష్టమయిపోయింది. ఇతర ధర్మాలన్నింటిలానే దైవధర్మం కూడా, మీరు కేవలం దాని సత్యతను అంగీకరించి, మీ విశ్వాసానికి చిహ్నంగా కేవలం ఆచార ప్రధానమయిన పూజాపురస్కారాలు జరపడంతో దైవధర్మం ఎప్పటికీ తృప్తి చెందదు. మరేదో ధర్మానికి లోబడి జీవిస్తూ ఈ ధర్మాన్ని మీరు ఎన్నటికీ అనుసరించలేరు.

మరో ధర్మంతోపాటు, దానికి తోడుగా కూడా దీని అనుసరణ సాధ్యపడదు. అందువల్ల నిజంగానే మీరు ఈ ధర్మాన్ని సత్యమయినదిగా నమ్మినట్లయితే ఈ ధర్మాన్ని భూమిపైన సంస్థాపించడానికి సర్వశక్తులు వినియోగించి పరిశ్రమించడం తప్ప మీకు మరో మార్గం లేదు. దీన్ని స్థాపించనయినా స్థాపించాలి లేదా ఆ కృషిలోనే తమ ప్రాణాలనయినా ధారపోయాలి. ఇదే మీ విశ్వాసం, నమ్మకంలో గల సత్యతను పరిశీలించడానికి ఇదొక్కటే గీటురాయి. మీ నమ్మకం నిజమయినదయితే మీరు మరో ఇతర ధర్మం క్రింద జీవిస్తూ సుఖప్రదంగా నిదురించనూ లేరు. మీరు ఆ ధర్మానికి సేవలందించడం, ఆ సేవలందజేస్తూ పొందిన అన్నపానీయాలను రుచులు ఆస్వాదిస్తూ తినడం సుఖంగా కాళ్లుచాపుకొని పడుకోవడం బహుదూర విషయం.

ఈ ధర్మాన్ని సత్యమయినదిగా భావిస్తూ ఇతర ధర్మం క్రింద మీరు గడిపే ఒక్కొక్క క్షణం బహుకష్టంగా గడుస్తుంది. పడక మీకు కంటక ప్రాయంగా కనిపిస్తుంది, అన్నం విషతుల్యమవుతుంది, సత్యధర్మాన్ని స్థాపించే కృషి చేయకుండా మీకు ఏ విధంగానూ నిలకడ ప్రాప్తం కాదు. అలాకాక అల్లాహ్ ధర్మాన్ని కాదని ఇతరుల ధర్మం క్రింద జీవిస్తూ మీకు సుఖం కలిగితే, మీరు ఆ స్థితికి రాజీపడితే మీరు నిజమయిన విశ్వాసులే కారు. మీరు ఎంతో ఏకాగ్రతతో మనస్సు లగ్నం చేసి నమాజులు చేసినా, పెద్ద పెద్ద సుదీర్ఘ ధ్యానాలు చేసినా, ఖుర్ఆన్ హదీసుల ఎన్నెన్ని వివరణలూ వ్యాఖ్యానాలూ చేసినా, ఇస్లామ్ తత్వాన్ని ఎన్ని విధాలుగా ఎలుగెత్తి చాటినా అంతా నిష్ప్రయోజనం. ఇది, ఇతర ధర్మాలకు రాజీపడిన వారి విషయం. పోతే, ఇతర ధర్మానికి భక్తిపూర్వకంగా ఊడిగం చేసేవారు, లేక మరే ధర్మం (ఉదాహరణకు ప్రజాస్వామ్య ధర్మం) కోసం నిరంతర కృషి జిహాద్ సలిపేవారు- వీరిని గురించి ఏమని చెప్పడం? మృత్యువు ఎంతో దూరంలో లేదు. ఆ సమయం ఆసన్నమయినప్పుడు వారు ప్రపంచ జీవితంలో సంపాదించిన సంపాదన అంతా దైవం స్వయంగానే వారి ఎదుట పెడతాడు. వీరు ఒకవేళ తమ్ముతాము ముస్లిములుగా భావిస్తూ ఉంటే ఘోరమయిన అవివేకానికి పాల్పడుతున్నారు. బుద్ధి ఉంటే స్వయంగా వారికే అర్థమయి పోయేది, ఒక

ధర్మాన్ని సత్యమయినదిగా నమ్మడం, దాన్ని స్థాపించడానికి కృషి చేయకపోవడం పరస్పరం విరుద్ధ విషయాలు. నీరూ నిప్పు ఏకత్రం కాగలవుకాని దైవవిశ్వాసంతోపాటు ఈ ఆచరణ ఎంతమాత్రం ఒకచోట చేరజాలదు.

ఈ సందర్భంలో ఖుర్‌ఆన్ చెప్పేదంతా ఈ ప్రసంగంలో ఎక్కడ వినిపించ వీలవుతుంది, కేవలం కొన్ని ఆయత్‌లు వినిపిస్తాను.

> జనం ఏమని అనుకుంటున్నారు, వారు కేవలం "మేము విశ్వసించాము" అని చెప్పగానే వారిని వదలివేయడం జరుగుతుందని, వారిని పరీక్షించడం జరగదని అనుకుంటున్నారా? వాస్తవంగా వీరికి ముందు ఎవరయితే విశ్వసించినట్లు ప్రకటించారో వారందరినీ మేము పరీక్షించాము. అందువల్ల విశ్వాస ప్రకటనతో ఎవరు సత్యవంతులో మరెవరు కారో అల్లాహ్ చూడటం అత్యవసరం. (అల్ అన్ కబూత్ : 2-3)

> జనుల్లో కొందరున్నారు, వారు, మేము విశ్వసించామని అంటారు, కాని వారిని దైవమార్గంలో బాధించినప్పుడు మానవులు పెట్టిన శిక్షకు, దైవం విధించే శిక్షకు భయపడవలసిన రీతిలోనే భయపడ్డారు. నిజానికి నీ ప్రభువు అనుగ్రహంతో విజయం ప్రాప్తిస్తే అతనే వచ్చి చెబుతాడు, మేమయితే మీకే తోడుగా ఉన్నాము అని. అల్లాహ్‌కు తెలియదా; మనుషుల హృదయాలలో ఏముందో? అయితే ఆయన తప్పక పరిశీలిస్తాడు ఎవరు విశ్వసించినవారో మరెవరు కపట విశ్వాసులో అని. (అల్ అన్ కబూత్ : 10,11)

> విశ్వసించినవారు నేడున్న స్థితిలో (సత్యవంతులూ, అసత్యవాదులూ అయిన విశ్వాస ప్రకటన కర్తలు కలగాపులగమయి) ఉండనివ్వడం అల్లాహ్ ఔచితీ విజ్ఞతలకు విరుద్ధమయిన విషయం. అశుద్ధమయిన వాటినీ శుద్ధమయిన వాటినీ వేరుపరచి ప్రస్ఫుటపరచనంత వరకు ఆయన వదలడు.
> (ఆలి ఇమ్రాన్ : 179)

> మీరేమని అనుకుంటున్నారు, మిమ్మల్ని ఇలాగే ఉట్టిగనే వదలి వేయడం జరుగుతుందని అనుకుంటున్నారా? నిజంగా ఇంకా అల్లాహ్ పరిశీలించనే

లేదు, మీలో ఎవరు సతత సమరం సలిపేవారో ఎవరు అల్లాహ్, ప్రవక్త, విశ్వాసులను, వదలి ఇతరులతో లోపాయికారిగా సంబంధాలు పెట్టుకునే వారెవరో!

(అత్ తౌబా : 16)

నీవు గమనించలేదా, అల్లాహ్ ఆగ్రహం చెంది ఉన్న వర్గం వారికి తోడ్పాటు అందజేసేవారిని? వీరు నీకు చెందరు, వారికీ చెందినవారు కారు.... వీరు షైతాన్ పార్టీకి చెందినవారు. జాగ్రత్త, షైతాన్ పార్టీవారే నిష్ఫలురు, పరాజయులు. నిస్సంకోచంగా, అల్లాహ్‌కు, ప్రవక్తకూ ప్రత్యర్థులయినవారు (సత్య ధర్మసంస్థాపనను అడ్డుకునేవారు) వారు ఓడిపోయేవారే. 'నేనూ, నా ప్రవక్త ఆధిక్యత నొంది తీరుతామ'ని అల్లాహ్ నిర్ణయించాడు. అల్లాహ్ నిస్సందేహంగా శక్తిమంతుడు, ధీమంతుడు కూడా. (అల్ ముజాదిలా : 14,19-21)

## జిహాద్ - సతత సమరం

ఈ ఆయత్‌ల ద్వారా తెలిసేదేమిటంటే, దైవధర్మం తప్ప ఇతర ధర్మం ఏదయినా నేలపై నెలకొన్న పరిస్థితిని ఒక విశ్వాసి ఎదుర్కొంటే అతడు నిజమైన విశ్వాసి అన్నందుకు చిహ్నం, అతను ఆ అసత్యధర్మాన్ని నిర్మూలించి దాని స్థానే సత్యధర్మాన్ని స్థాపించేందుకు ప్రయత్నం చేస్తాడా లేదా అన్నదే. అతను ప్రయత్నం చేస్తే, ఆ ప్రయత్నంలో తన ప్రాణాలొడ్డి కృషి సలిపినట్లయితే, ఏ విధమయిన నష్టాన్నయినా భరించడానికి సిద్ధమయితే అతను నిజమయిన విశ్వాసి. అతని ప్రయత్నం సఫలమవుతుందా లేదా అన్నది ప్రశ్నకాదు. కాని అతను ఆ సత్యధర్మం ఆధిక్యత పొంది ఉండటాన్ని ఆమోదిస్తే లేక అది ఆధిక్యత పొంది ఉండటానికి స్వయంగానూ తోడ్పడితే అతను చేసే విశ్వాస ప్రకటన అబద్ధం అన్న మాట.

## మార్పు సంఘర్షణ ద్వారానే సాధ్యం

ఈ ఆయత్‌లలో దివ్యఖుర్ఆన్, సత్యధర్మ సంస్థాపనలో గల కష్టాలను ప్రస్తావించేవారికి సయితం జవాబు ఇచ్చింది. సత్యధర్మాన్ని స్థాపించే కృషి ఎప్పుడు

చేపట్టినా ఏదో ఒక అసత్య ధర్మం బలంగా, ఉధృతంగా మొదటి నుంచే నెలకొని ఉంటుంది. దాని వద్ద శక్తి ఉంటుంది. ఉపాధి భాండాగారాలు సయితం దాని వద్దనే ఉంటాయి. జీవితపు అన్నిరంగాలలో అదే ఆవహించి ఉంటుంది. ఇలా సుస్థాపిత ఒక ధర్మం స్థానంలో మరో ధర్మాన్ని స్థాపించడం పూలపాన్పు మటుకు కాజాలదు. సుఖంగా, సౌకర్యాలతో, తీయతీయగా, అడుగులు వేసుకుంటూ ఈ పని ఎన్నడూ సంభవం కాలేదు, ఇకపైనా సంభవం కాజాలదు.

అసత్య ధర్మం క్రింద జీవిస్తూ ప్రాప్తమయ్యే ప్రయోజనాలు కూడా అందకుండా పోరాదని, సత్యధర్మ స్థాపన కూడా జరగాలని మీరు కోరుకుంటే అది ఎంత మాత్రం సాధ్యమయ్యే పనికాదు. ఈ మహత్కార్యం ఎప్పుడు పూర్తి అయినా, మీరు ఆ సత్యధర్మానికి లోబడి జీవిస్తే మీకు ప్రాప్తమయ్యే సకల హక్కుల్ని, సమస్త ప్రయోజనాలను, సర్వసౌకర్యాలను తృణీకరించేందుకు సంసిద్ధులయి ఉండాలి. ఈ శ్రమలో కృషిలో ఏ ఏ నష్టాలు ఎదురయినా వాటిని ధైర్యంతో భరించడానికి సిద్ధం కావాలి.

ఈ కష్టాలను, చిక్కుల్ని ఎదుర్కొనే సాహసం ఉన్నవారి వల్లనే దైవమార్గంలో సతత సమరం జరిపే కార్యం సాధ్యమవుతుంది. ఇలాంటివారు నిత్యం తక్కువగానే ఉంటారు. పోతే ఎవరయితే సత్యధర్మాన్నయితే అనుసరిస్తూ ఉండాలని, అయితే సుఖవంతంగానే మనగలగాలని అనుకుంటారో వారు మున్ముందుకు వచ్చి ప్రకటనలు చేయడం తగదు. వారు సుఖంగా కూచొని తమ మనోవాంఛల సేవలు చేసుకుంటూ గడపడమే సరయినది. దైవ మార్గంలో కష్టాలు సహించేవారు కడకు తమ త్యాగాలతో సత్యధర్మాన్ని స్థాపించినప్పుడు వారు ముందుకువచ్చి 'మేము మీతోపాటే ఉన్నాము' అంటే మేమూ మీ వాళ్ళమే మా వాటా కాస్త ఇవ్వండి అని అనాలి.

-: సమాప్తం :-